

సైఫుద్దీన్ కిచ్లూ (శిల్పి: ఇ. వుచెతిచ్, మార్చి 1956)

## రానున్న సంచికలో (మే 10, 1957)

* శాంతి, శ్రమల ఉత్సవం—వై. అఫ్నసెన్కో, రష్యన్‌సమాఖ్య విద్యామంత్రి
* సన్నిహిత సంబంధం —ఎన్. గొన్చరోవ్, ఉత్తరాలశాఖ సంపాదకులు
* విఖ్యాత వార్షికోత్సవం (స్వాతంత్ర్య సమరానంతరం 100 సంవత్సరాలు)
* మీ రాకకై మాస్కో నిరీక్షణ (యువజనోత్సవాన్ని గురించి)
* మా సమిష్టి క్షేత్రంలో
  సామ్యవాద శ్రమవీరులు, ఎన్.ఎస్. లైస్కిన్, రష్యా సమిష్టిక్షేత్రాధ్యక్షులు, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ సభ్యులు
* శ్రామిక వర్గ కుటుంబం
* భారత-రష్యా సంస్కృతీ సంఘపు 6వ వార్షికోత్సవం
* రష్యన్ స్వభావం (కథానిక) —ఎ. టాల్‌స్టాయ్
* డునో, బెలూన్ తయారు చెయ్యడం —నొసోవ్
* తాష్కెంట్—ఫ్రుంజ్—అల్మ-అతా—స్తాలినాబాద్ చిత్రనిర్మాణ శాలల సందర్శన —యూరీ ఖుజెన్, వార్తా వివరణ

## విషయసూచిక



ముఖ చిత్రం: వి. ఇ. లెనిన్
(చిత్రకారుడు యన్. ఆంద్రియేవ్)

మూడవ అట్ట: వ్యంగ్య చిత్రాలు
(చిత్రకారులు ఇ. వెదెర్నికోవ్, వై. ఫెదొతోవ్, యన్. జ్వరేవ్, బి. లియో, బి. పోద్యగిన్)

చివరి అట్ట:
లెనిన్ గ్రాడ్‌లోని జనరల్ స్టాఫ్ భవనం ఆర్చిగుండా ప్రఖ్యాతమైన వింటర్ ప్యాలెస్ దృశ్యం.
—ఛాయాచిత్ర గ్రాహకుడు: ఎఫిమోవ్


భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము: ముద్రాపకులు: పంజాబీ ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.

సంపుటి 8,
సంచిక 8

# సోవియట్ భూమి

ఏప్రిల్ 25,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే తెలుగు, హిందీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, మలయాళం, పంజాబీ, మరాఠీ, ఒరియా, ఇంగ్లీషు భాషలలో ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



# లెనిన్ కన్న కల నిజమయింది

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ స్థాపకుడూ, సోవియట్ దేశ శ్రమికప్రజల ప్రియతమ నాయకుడూ అయిన వ్లాదిమీర్ ఇలీచ్ లెనిన్ 1870 ఏప్రిల్ 22వ తేదీన జన్మించారు.

వి. ఐ. లెనిన్ పీడనను, అది ఏ రూపంలోనున్నాసరే తీవ్రంగా ద్వేషించేవారు. అందువల్లనే ఆయన వలసపెత్తందారీ విధానాన్ని పట్టువలతో బట్టబయలు చేసేవారు. భారత మహా ప్రజలను దోచుకొంటూ, పీడిస్తూ ఉండిన బ్రిటిష్ వలసపెత్తందారుల గురించి ఆయన ఆగ్రహపూరితము, వాస్తవము అయిన అనేక విషయాలను పలికారు. "భారత దేశంలో దాదాపు 30 కోట్లమంది ప్రజలు బ్రిటిష్ దురధికారవర్గ దమననీతికీ, దోపిడీకి గురిఅవుతున్నారు .... భారత దేశంలోని బ్రిటిష్ పరిపాలనా విధానం అనే దానియొక్క దౌర్జన్యానికీ, దోపిడికి అంతేలేదు. ప్రజానీకంలో ఉన్న అంతటి దారిద్ర్యము, అంతులేని కరువు ప్రపంచంలో మరెక్కడా కనుపించదు" అని లెనిన్ వ్రాసారు. అమృత్‌సర్‌లో, నిరాయుధులైన ప్రజలమీద బ్రిటిష్ వలసపెత్తందారులు తుపాకులు కాల్చి జరిపిన ఘోర హింసాకాండను వి. ఐ. లెనిన్ 1919లో క్రోధావేశులై తీవ్రంగా ఖండించారు.

భారత ప్రజలకుగల గొప్ప భవిష్యత్తులో వి. ఐ. లెనిన్ దృఢ విశ్వాసాన్ని కలిగివుండేవారు. స్వతంత్రమైన నూతన భారతదేశం—సర్వసత్తాధికార, వర్ధమాన భారత దేశం—స్వతంత్ర దేశాల మధ్య అవతరించగల రోజును ఆయన ముందుగానే ఊహించగలిగారు. భారతీయ ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాన్ని ఆయన అత్యంత శ్రద్ధతో పరిశీలిస్తుండేవారు. "భారత దేశ స్వాతంత్ర్యం కొరకు పోరాటం తీవ్రతరం" అవడాన్ని గురించి ఆయన 1908 లోనే చెప్పగలిగారు. చైనా, పర్షియా, భారత దేశం, తదితర దేశాలలో కోటానుకోట్ల ప్రజలు జాతీయ చైతన్యాన్నిపొంది అభివృద్ధి నిరోధక 'అగ్ర'రాజ్యాల బానిసత్వంనుండి విముక్తి పొందడానికి ప్రయత్నిస్తుండడాన్ని మనం గత దశాబ్దంలో చూచాము," అంటూ ఆయన తర్వాత వ్రాసారు.

1917 అక్టోబరు మహావిప్లవానంతరం, వి. ఐ. లెనిన్ సోవియట్ ప్రభుత్వ అధినేత అయిన తర్వాత సోవియట్ దేశం, భారత దేశాల మైత్రి నిర్మాణానికి మొదటి పునాదిరాళ్ళు వెయ్యబడ్డాయి. 1920 మార్చి 4వ తేదీన భారతీయ విప్లవాత్మక సంఘం యొక్క ఒక సమావేశంలో నవీన సోవియట్ ప్రభుత్వం యొక్క విదేశాంగ విధాన సూత్రాలను ఆమోదిస్తూ ఒక తీర్మానం ఆమోదింపబడి, వి.ఐ.

(మిగత 37వ పుటలో)

కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ రెండవ మహాసభలో ప్రాచ్య ప్రజా ప్రతినిధుల మధ్య వి ఐ లెనిన్



# లెనిన్



"1918 ఆకురాలు కాలంలో, సోర్మోవో కార్మికుడు, ద్మిత్రీ పావ్లోవు నేను, లెనిన్ ముఖవైఖరిలో ప్రముఖంగా కనిపించేదేమిటి? అని అతని అభిప్రాయం అడిగాను.

"నిష్కాపట్యం. సత్యంలాంటి సరళత.

"ఈ మాటలు అతను దీర్ఘంగా ఆలోచించిన తర్వాత వచ్చిన ఒక నిర్ణయంలాగా దృఢంగా చెప్పాడు."

(మాక్సిం గోర్కీ, "లెనిన్ను గురించిన జ్ఞాపకాలు")



మాస్కో, రెడ్ స్క్వేర్లో జరిగిన ప్రదర్శనంలో లెనిన్

# పరమ కారుణికుడు



లెనిన్, తన సహచరులకు వీడ్కోలు చెబుతూ.



కార్మికుల నుద్దేశించి ఉపన్యసిస్తోన్న లెనిన్

కారల్ మార్క్స్ స్మారక నిర్మాణానికి శంకుస్థాపన సమయాన లెనిన్



"శ్రామిక ప్రజల హృదయాలను, సానుభూతినీ తమ వైపుతిప్పుకొనే ఒక విధమైన ఆకర్షణ ఆయనలో వుంది" అన్నారు, లెనిన్ను గురించి గోర్కీ.

"ఆ వాగ్ఝరి, ఆ సమగ్రత, నిష్కపటమైన ఆ వాక్పటిమ....వేదికపై మూర్తిమంతమవుతున్న ఆయన వ్యక్తిత్వం, మహత్తర కళలా గోచరిస్తున్నది. ప్రతిదీ అందులో ఇమిడివుంది, అనావశ్యకమైంది ఒక్కటీ లేదు, అలంకారాలంటూ ప్రత్యేకంగా లేవు; లేదా ఒకవేళ వున్నా అవి ముఖానికి రెండు కళ్ళలాగ, అరచేతికి అయిదు వ్రేళ్లలాగా సహజమైనవి ....అతి క్లిష్టమైన రాజకీయ సమస్యలగురించి అంత సరళంగా మాట్లాడడం మొట్టమొదట నేను అప్పుడే విన్నాను." (మాక్సిం గోర్కీ, "లెనిన్ను గురించిన జ్ఞాపకాలు")



కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, మూడవ మహాసభలో, ఉపన్యాసకుల ప్రసంగాలను వ్రాసుకొంటున్నారు లెనిన్.

"బాహిరమైన ఆడంబరాలేవీ లేకపోవడం వ్లాదిమీర్ ఇల్యీచ్.... వైఖరికి ఒక ప్రస్ఫుట లక్షణం....ఆ పొట్టిరూపు, సర్వసామాన్యమైన ఆ టోపీ ఏ కర్మాగారావాసంలోనైనా ఎవరినీ ప్రత్యేకంగా ఆకర్షించక పోవచ్చు. ఇదేవిధంగా జాడు గౌనువేసుకుంటే చాలు, వ్లాదిమీర్ ఇల్యీచ్ వోల్గా రైతుల గుంపులో కలిసిపోవచ్చును. ఎందుచేతనంటే అసలారూపు, సాక్షాత్తూ, క్రింది అంతస్తుకు చెందినవారిని పోలి వుంటుంది, అంతేకాదు వాళ్ళకూ ఆయనకూ రక్త సంబంధం వున్నట్టుగా వుంటుంది. ఒక్కసారి వ్లాదిమీర్ ఇల్యీచ్ కళ్ళవంక, అపూర్వమైన నల్లకళ్ళను చూస్తేచాలు—వాటిల్లో ప్రదీప్తమయ్యే ఆ అంతర్ద్యుతి, శక్తి....నువ్వొక అసామాన్యమైన మహావ్యక్తి సమ్ముఖాన ఉన్నావన్న భావం నీలో కలిగి తీరుతుంది. ఒక ప్రసిద్ధ ఫ్రెంచి శిల్పి, ప్యారిస్‌లో ఈ మహామహుణ్ణి కలుసుకొని, అద్వితీయమైన ఆయన నుదుటి రేఖల్ని చూచి ముగ్ధుడై, దాని ప్రతిరూపాన్ని మలచుకొను అనుమతించవలసినదని ఎంతో వేధించాడంటే, అందులో అపూర్వత ఏమీలేదు. ఆ శిల్పి అభిప్రాయంలో ఇదొక విశిష్ట ఆత్మిక సౌందర్యభరితమైనది. వ్లాదిమీర్ ఇల్యీచ్ నుదుటికీ, పూర్వకాలపు ప్రసిద్ధ తాత్త్వికుడు సోక్రెటీస్ శిల్పాలలోని రూపురేఖలకూ ఎంతో పోలికను, ఆ శిల్పి చూచాడు." (లెనిన్ సహచరులలో ఒకరైన, జి. ఎన్. కృజ్జీనోవ్‌స్కీ లెనిన్ను గురించిన జ్ఞాపకాలనుంచి)

1922 వేసంగిలో గోర్కీ గ్రామంలో విశ్రాంతి తీసుకొంటున్న లెనిన్



★

ఈ మహాసభకు వెళ్ళిన బల్గేరియన్ రచయిత, క్రుమ్‌కుల్యావ్కోవ్ ఈ సంఘటననుఇలా వర్ణించారు: "లెనిన్ లోపలికి వచ్చారు. వెంటనే సభావేదికమీది బల్లదగ్గరకు పోతుండగా, అప్పుడు ప్రసంగిస్తోన్న ఉపన్యాసకుని మాటలు, ఆయన్ను ఎంతో ఆకర్షించినట్టున్నాయి. ఆ చుట్టంతా తిరిగి అక్కడికి చేరుకొనేలోపున కాలహరణం కాకుండా, సభామంటపు చిట్టచివరి మెట్టుమీద ఆయన కూర్చుని తమ నోటుపుస్తకం తీసి త్వరత్వరగా వ్రాసుకుంటున్నారు."



వాహ్యాళికి పోతూ లెనిన్



మేనల్లుడు విక్తర్‌తో, లెనిన్

వ్లాదిమీర్ ఇల్యిచ్‌కి పిల్లలంటె ప్రత్యేకమైన ఆసక్తి, వాళ్ళ విషయాల్లో ఆయనకు మంచి నేర్పరితనం వుండేది, అదోవిధమైన మెత్తదనం ఉండేది, జీవితాంతం వరకూ పిల్లలపట్ల ఆయన ప్రేమ యిదేవిధంగా ఉండేది. ఆయన మరణానికి ముందు, గోర్కీ‌లోని వ్లాదిమీర్ ఇల్యిచ్ గృహములో, సంవత్సరాదినాడు, ఫిర్‌చెట్ల ఉత్సవం రైతు బాలలకు ఏర్పాటు చేయబడిందని మనకు తెలుసు. ఆ రైతు పిల్లలు మొట్టమొదటిసారిగా చక్కగా దీపాలతోటి, కానుకలతోటి అలంకరించబడివున్న ఫిర్ చెట్టునుచూచి ఉల్లాసంగా ఆడసాగారు. వ్లాదిమీర్ ఇల్యిచ్ తనను (అప్పటికే నడవ లేకపోవడం మూలాన) ఆ హాలులోకి పట్టుక పొమ్మన్నారు. క్రీడాసక్తులైవున్న ఆ పిల్లలు ఆయనదగ్గరకు పరుగెత్తారు. ఆయన వొళ్ళోకి దూకడానికి ప్రయత్నించారు. ఆయన్ను వదిలిపెట్టలేదు. నదెజ్దా కాన్‌స్తాన్తినోవ్నా (లెనిన్ సతి,) మేరియా ఇల్యినిచ్నా (సోదరి) తమకు పిల్లలంటే ఎంతో మక్కువే అయినప్పటికీ, కొంత వాళ్ళు ఆయన్ను చుట్టుముట్టకుండా దూరంగా వుంచను ప్రయత్నించారు. చాలా జబ్బుతో వున్నప్పటికీ విపరీతంగా తలనొప్పితో బాధపడుతున్నప్పటికీ లెనిన్ వాళ్లిద్దర్నీ వారించి ఆ పిల్లల్ని తన దగ్గరికి రమ్మని పిలిచారు." (లెనిన్ సహచరులలో ఒకరైన ఎన్. సెమష్కో జ్ఞాపకాలనుంచి)

ఇంటివద్ద లెనిన్



# లెనిన్ గురించి

లెనిన్ తమ జీవితంలోని ప్రతిక్షణం పోరాటంలోనే పూర్తిగా ఉంటూ వచ్చారు. పోరాటంలో, పోరాటంకొరకు అన్న ఆశయంతో ఆయన తన ఆలోచనల నన్నింటిని సేనా నాయకుని దృష్టితో పరిశీస్తుండేవారు. శ్రామిక విప్లవం అయిన, ఆ చారిత్రక ఘడియ యొక్క మానవ కార్యకలాపాలు ఆయనలో మూర్తీభవించాయి. అలాంటిది మరెవ్వరిలోను లేదు. వ్యక్తిగత విషయాలుగాని, మనస్సుకు కొద్దిపాటి విశ్రాంతి కావాలన్న విషయంగాని, విలాసార్థం మరేదైనా విద్యలో పరిశ్రమ చేయాలన్న తలంపుగాని ఆయన మనస్సును చెదరగొట్టలేకపోయేవి. ఊగిసలాట, అనుమానం ఆయనకు తెలియని విషయాలు. అదే ఆయనయొక్క బలం. ఆయన పోరాడిన ఆశయంతో విజయం చేకూరడానికి కారణం కూడా ఇదే.

రొమా రోలా,
ప్రముఖ ఫ్రెంచి రచయిత.

☆

శ్రామిక విప్లవం యొక్క మహాప్రబోధకుడు లెనిన్. శ్రద్ధాసక్తులను. పొదుపును, పవిత్రతను, నిష్కాపట్యాన్ని బోధించిన మహోన్నత నైతికాదర్శాలు కలవాడాయన.

హొ చి మిన్,
వియత్నామ్ ప్రజాస్వామ్య రిపబ్లిక్ అధ్యక్షుడు.



రైలు పెట్టెలో

మధ్య ఆసియాలో నలుగురు మహావిజేతలను గురించి కథలుగా చెప్పుకొంటూ, ఇప్పటికి గూడా వారినిగురించి తలుచుకొంటుంటారు : వారు ఇస్కందర్ (అలెగ్జాండర్) సుల్తాన్ మహ్మద్, చెంఘిజ్‌ఖాన్, తైమూర్ (టామెర్లేన్). ఈ నాలుగు పేర్లకు ఇప్పుడు ఐదవపేరొకటి—సైనికవ్యక్తిగాక, విభిన్న తరగతికిచెంది, కథలుగా చెప్పుకొనబడుతున్న, మరొకరంగంలోని విజేత అయిన లెనిన్ పేరు —చేర్చబడవలసియున్నది.

జవహర్‌లాల్ నెహ్రూ
భారత రిపబ్లిక్ ప్రధాని.

☆

ప్రపంచ చరిత్ర యొక్క అనేక యుగాలలో ఆనందకరముయిన పలుకులను పలికిన నాయకులు, విజ్ఞానశాస్త్రవేత్తలు వేలకొలది ఉన్నారు. కాని అవి వాస్తవ జీవితంలో యెన్నడూ అమలుపర్చబడలేదు. కాని లెనిన్, మీరు అలా కారు. మీరు చెప్పడము, ప్రబోధించడమేగాక, మీ మాటలను వాస్తవాలను చేసారు. మీరు ఒక నూతన దేశాన్ని సృష్టించారు. సంఘటిత పోరాట మార్గాన్ని మాకు చూపించారు. మీరు మీ మార్గంలో వేలాది అవరోధాలను యెదుర్కొన్నారు. అలాంటివి నేనూ యెదుర్కొంటున్నాను. మీమార్గాన్నే అనుసరించాలని అనుకుంటున్నాను. అందుకు నా విరోధులు వ్యతిరేకిస్తున్నప్పటికి, అలాచేస్తే నా ప్రజలు హర్షించితీరుతారు......

సన్ యత్-సెన్,
ప్రముఖ చైనా విప్లవకారుడు, ప్రజాస్వామ్యవాది

అంతా మామూలు పరిస్థితికి వస్తోంది





ఒక్క నిమిషం వృథా కాకూడదు



ఇతరులందరికంటే వివేకవంతుడైన లెనిన్, సామాన్య ప్రజానీకం యొక్క వాణిని, హృదయ స్పందనాన్ని అతిశ్రద్ధగా వినేవారు, వారిని, వారి ఆశయాన్ని స్తుతించేవారు, సామాన్య మానవుడు, అతని కృషియే జీవితం యొక్క పునాదిని చూపించారు....

సామాన్య ప్రజలను, వారి జీవితాన్ని గురించి లెనిన్ తెలుసుకొన్నంత బాగా తెలుసుకొని వారికి నాయకత్వం వహించినవారు ఇది వరకు చెప్పలేము. అందువలననే లెనిన్ కార్మికుల హృదయాలలో యెల్లప్పుడూ ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తూ వచ్చారు....

శ్రామికవర్గ భావాలను ముందుకు తీసుకుపోయినవారు మాత్రమే కాదు, లెనిన్. అంతకంటే గూడా అధికులాయన. దానితో సంలీన మయ్యారు ఆయన. ఆయన భావాలు ప్రజానీకం యొక్క భావాలు. అవి నిర్దిష్టంగాను, సరళంగాను, ఉద్వేగపూరితంగాను వుండేవి. శ్రామిక వర్గంయొక్క హృదయంతో ఆయన హృదయం సంలీనమైపోయేది.

మార్టిన్ అండర్సన్-నెక్సో,
ప్రముఖ డెనిష్ రచయిత.

కార్మికునివలె ఆలోచించగలిగిన మేధావంతులలో లెనిన్ ఒకరు. అర్థరహితమయిన పదజాలము, అనవసర ప్రలాపాలు లేకుండా మాట్లాడగలిగిన వక్త లెనిన్, యావత్తు ప్రపంచాన్ని ఊపివేసిన వ్యక్తి ఆయన. ప్రపంచంలోని ప్రతి విషయాన్ని గురించి ఆయన మేధస్సు యెల్లప్పుడు ఆలోచిస్తుండేది. తన జీవితాంతంవరకు ఆయన చైనా కూలివలె, నీగ్రో జోకర్‌వలె అనుభూతిని పొందుతూ, ఆలోచించగలిగే మహత్తర సామర్థ్యాన్ని కలిగి ఉంటూ వచ్చారు. లెనిన్‌గ్రాడులోని లోహ కార్మికుడు, వాంసలోని జవుళి కార్మికుడు, లేదా న్యూవర్డినిమాలోని గనికార్మికుడు యేవిధముగా తెరచిన పుస్తకంవలె అర్థమయ్యేవారో అదేవిధంగా ఆయనకు అణచివేయబడుతున్న అన్నామ్ దేశీయుడు, భారతీయుడు అర్థమయ్యేవారు. నవమానవుని యొక్క ఆదర్శస్వరూపం ఆయన. భవిష్యత్తులో మాకూ ఆదర్శం ఆయనే.

పి. వెయ్‌లాంట్-కొట్యూరియర్,
ఫ్రెంచి కార్మికోద్యమ ప్రముఖ నాయకుడు, రచయిత.



వి.ఐ.లెనిన్, తన సతి ఎన్.కె.కృప్స్కాయా(ఆయనకు కుడిప్రక్క)తోనూ, సోదరి ఎ.ఐ. ఎలిజరోవా, మేనల్లుడు విక్యా, గోర్కీలోని ఒక కార్మిక పుత్రికతోనూ

# స్వగృహంలో లెనిన్

## వి. బోన్చ్ - బ్రుయెవిచ్

లెనిన్ గృహానికి నేను వెళ్ళినప్పుడల్లా నదెజ్దా కృప్స్కాయాపట్ల, ఆమె తల్లిపట్ల—యీామె ఎప్పుడూ వారితోనే వుంటూవుండేది—ప్రతి విషయంలోనూ ఆయన చూపే స్నేహభావమూ, గాఢమైనప్రేమ భావమూ నన్నెంతో ఆశ్చర్య పరిచేవి, ముగ్ధుణ్ణిగావించేవి. లెనిన్‌కు ఎప్పుడూ చికాకు కలిగించకుండా, ఆయన ఎప్పుడూ నిమగ్నులై వుండే అనేక వైజ్ఞానిక, రాజకీయ సమస్యల పనిని ప్రశాంతంగా చేసుకునేందుకు నదెజ్దా కృప్స్కాయా అవకాశం కలిగించేందుకు ప్రయత్నించేవారు. కాని యిది సులభమైన పనికాదు. లెనిన్ తన యింట్లో (ఆయన తరచుగా గ్రంధాలయాలకు వెళ్ళి గంటలతరబడిగా వుండేవారు) శుభ్రంగానూ నిరాడంబరంగానూ వున్న ఆయనగదిలో వున్నప్పుడు, ప్రక్కగదిలోనూ, వంటింటిలోనూ—వంటింట్లో కుటుంబపు స్త్రీలు కొన్ని సమయాల్లో గృహకార్యాల్లో నిమగ్నులై వుండేవారు—ఏమి జరుగుతూ వుండేదో గమనిస్తూ వుండేవారు.

అక్కడనుండి గుసగుసలుగా వినవచ్చినా, టీతో తినడానికి రొట్టె లేదనో, యింకేదో కొనాలనో ఆయన తరచుగా వింటుండేవారు. ఆయన హటాత్తుగా, తెరచివున్న గుమ్మందగ్గరకు వచ్చి గట్టిగా చెప్పేవారు :

"రొట్టెసంగతి నేను చూస్తానే; ముందర ఎందుకు చెప్పావు కావు, వాద్యా? నేనుకూడా యింటిపనులు చక్కబెట్టాలిగదా...."

ఈ విషయంలోకూడా లెనిన్‌ను ఎవ్వరూ ఆపలేకపోయేవారు. కనురెప్పపాటులో కోటువేసుకుని ఆయన పొరుగునవున్న రొట్టెలు చేసేచోటికో, దుకాణానికో వెళ్ళి అవసరమైన దానిని తెచ్చేవారు.

"నేను ఎంచి తీసుకవచ్చాను"అని తనకు తానే తీసుకవచ్చిన దానిని తీస్తూ విజయగర్వంతో చెప్పి, అంతరాయం కలిగిన తన పనిని సాగించడానికి తొందరగా గదిలోనికి వెళ్ళిపోయేవారు.

వారు నియమిత సమయాల్లో, ఖచ్చితంగా మధ్యాహ్నభోజనం, టీ, రాత్రిభోజనం ఆరగిస్తారు. ఆ సమయాల్లో ఎవరైనా కామ్రేడ్స్ వచ్చినట్టయితే, మేజామీదవున్న ప్రతి పదార్థాన్నీ అతిధికి పెడుతూ లెనిన్ స్వయంగా తానే శ్రద్ధతీసుకునేవారు.

నదెజ్దా కృప్స్కాయా తల్లి తరచు జబ్బుపడేది. ఆమెపట్ల లెనిన్ యింకా యెక్కువగా శ్రద్ధ చూపేవారు. ఆమె విషయములో లెనిన్ చూపే ఆదరం మనలను ముగ్ధులను గావిస్తుంది. ఆయన స్వయంగా డాక్టరు వద్దకు వెళ్ళేవారు, మందులు కొనేవారు, ఆ రోగగ్రస్తురాలికి ఉత్సాహం కలిగించేవారు.

"జబ్బుసమయంలో అన్నిటికంటె ముఖ్యవిషయమేమిటంటే, ధైర్యంగా ఉండడం"అని అంటుండేవారు, లెనిన్.

ఇంటర్ కోస్టల్ నరాల వాపువల్ల—ఆయన యీ జబ్బుతో తరచుగా బాధపడేవారు—కలిగే భయంకరమైన బాధను శాంతంగా

భరిస్తూ ఆయన యిందుకు చక్కని దృష్టాంతంగా ఉండేవారు. దీని వల్ల కలిగే అతిఘోరమైన బాధను రెండవపార్టీ మహాసభకు కొస్త ముందరగానే భరించారు. విదేశాలలోని రష్యన్ విప్లవ సోషల్ డెమోక్రాట్ల సంఘం జినీవా మహాసభ సమయంలో ఆయన అద్భుతమైన స్థైర్యాన్ని చూపారు. మహాసభ రెండవ రోజున, ఆయన సైకిలుమీద బాగా జోరుగా వెళ్తుంటే అది ట్రాముకారు బడీలో చిక్కుకొని ఆయన పడిపోయారు. బాగా దెబ్బ తగిలింది. దగ్గర్లోని వైద్యునిచేత దెబ్బతగిలిన కంటికి కట్టుకట్టించుకొని, కంటికి నల్లని కట్టుతో ఆయన మహాసభకు వచ్చారు. అది విపరీతంగా బాధపెడుతున్నప్పటికీ, ద్వితీయ పార్టీ మహాసభ కృషిగురించి, అందులో వచ్చిన చీలికగురించి ఆ సాయంత్రం పెద్ద రిపోర్టునిచ్చి ఆయన చివరివరకూ సమావేశాన్ని వదిలి వెళ్ళలేదు.

1918 ఆగస్టులో గాయపడినప్పుడు ఆయన చూపిన ధైర్యం కూడా ప్రసిద్ధిచెందినదే. తన జబ్బుగురించి ఆయన దృక్పథం యిలా ఉండగా జబ్బుపడి తన దగ్గరనున్న వారందరిపట్ల ఆయన ఎంతో శ్రద్ధనూ, సానుభూతినీ చూపేవారు.

నదేజ్దా కృప్‌స్కయాతో ఆయన సంబంధాలు నిజమైన సామ్యవాద కుటుంబానికి మంచి ఆదర్శంగా ఉండగలవు.

నిరంతర ఆదరణ, స్నేహపూర్వకమైన సాహచర్య దృక్పథం, కలసివుందామన్న అభిలాష, సరికొత్త వార్తలను, నవ్యభావాలనూ తెలుపుకుందామనీ, రాజకీయ జీవితంలో ముఖ్య విషయాలన్నిటిని కలసి చర్చించుకుందామనీ అభిలాష, ఎక్కువగా పనిచేసిన తరవాత కలసి విశ్రాంతి తీసుకోవాలన్న కోరిక—లెనిన్ కుటుంబ సంబంధాలిటువంటివి. బయటికి వెళ్ళడమంటే లెనిన్‌కు చాలాయిష్టం, సెలవు రోజునగాని, పనిలేనిరోజునగాని కాలక్షేపం చెయ్యగల సమయం లభిస్తే ఆయన నదేజ్దా కృప్‌స్కయాతోనూ, తనవద్దకు వచ్చిన తన అక్కచెల్లెళ్ళతోనూ వెంటనే నగరం వెలుపలికి బయలుదేరేవారు. వారితో ఆయనకు చాలా సత్సంబంధాలుండేవి. వారికి ఉత్తరాలు వ్రాస్తుండేవారు, రష్యానుండి వచ్చి వారిని చూసిన కామ్రేడ్సును వారెలా వున్నారని గుచ్చిగుచ్చి ప్రశ్నలడిగేవారు. నదేజ్దా కృప్‌స్కయాకు ఎక్సోఫ్థల్మిక్ గ్రాయిటర్ వ్యాధివచ్చినప్పుడు, లెనిన్ ఆమెకు ఎంతో ప్రేమతో ఉపచారాలను చేసేవారు, చాలా గృహకృత్యాల బాధ్యతను తనే తీసుకొనేవారు, ఆమెను ఎక్కువ శ్రమ పడనిచ్చేవారుకాదు, ఆందోళన పడనిచ్చేవారుకాదు. ఆమెతోబాటు ఆయన మంచి డాక్టర్లందరివద్దకు వెళ్ళేవారు. శస్త్రచికిత్స తప్పనిసరి అని నమ్మకం కలిగి ఆయన బెర్నీలోని ప్రఖ్యాత శస్త్రవైద్యుడైన ప్రొఫెసర్ కోచర్‌ను అందుకు ఒప్పుకొమ్మని, శస్త్రచికిత్స జరిగేటప్పుడు వైద్యశాలలో వున్నారు. నదేజ్దా కృప్‌స్కయా దీర్ఘవ్యాధి కాలంలో లెనిన్ ఎక్సోఫ్థల్మిక్ గ్రాయిటర్ గురించి వాఙ్మయాన్ని, దాని చికిత్సామార్గాన్ని ఎంతో శ్రద్ధగా చదివారు. నదేజ్దా కృప్‌స్కయా వ్యాధి గురించి లెనిన్ నిజమైన నిపుణునిలా చర్చించేవారని డాక్టర్లు పలుసార్లు అనడం నేను విన్నాను. ఆయన సర్వదా, సర్వత్రా నదేజ్దా కృప్‌స్కయాపట్ల ప్రత్యేకమైన శ్రద్ధతీసుకునేవారు.

చాలాకాలం విదేశాలలో వుంటూకూడా లెనిన్ తన తల్లి మారియా అలెగ్జాండ్రోవ్నా ఆరోగ్యస్థితిగతు లన్నిటి గురించి శ్రద్ధతో తెలుసుకునేవారు; ఆమెనెంతో ప్రేమించేవారు. ఆయన ఎంత తొందర పనుల్లో వున్నా, అత్యంత ముఖ్యమైన విప్లవ విషయాలలో ఆయన తల మునకలుగా నిమగ్నులై క్షణం తీరికలేకుండా వున్నా నిద్రనూ, విశ్రాంతినీ మానుకుని ఆయన అవకాశం కలిగించుకుని తప్పకుండా ఆమెకు మమకారంతో, ప్రేమతో ఉత్తరాలు వ్రాసేవారు, తన గురించి, నదేజ్దా కృప్‌స్కయా గురించి, తనవద్ద వున్నట్టయితే తన అక్కచెల్లెళ్ళ గురించి తెలియజేసేవారు.

రెండవపార్టీ మహాసభ తరవాత లెనిన్ కొంతకాలం జినీవా సరస్సు తీరాన లూసన్నెలో నివసించారు. మా సంస్థ వ్యవహారాల గురించి నేను తరచు అక్కడకు వెళ్ళవలసి వచ్చేది. ఒకప్పుడు స్విట్జర్లాండ్‌లో రెండువారాల పాటు వుండడానికి లెనిన్ సిద్ధమవుతూ వుండగా, అనేక విషయాల గురించి, మా ప్రచురణలగురించి చర్చించడానికీ, తొందరగా చేరవలసిన ఉత్తరాలు, వార్తా పత్రికలు అందజేయవలసిన స్థలాన్ని నిర్ణయించడం గురించి మాటాడడానికీ నేను ఆయన వద్దకు వెళ్ళాను. ఆయన చాలా సంతోషంగా వుండగా నేనక్కడకు వెళ్ళాను.

"వెళ్దాం పదండి" అన్నారాయన, "నాకూ, నాద్యాకూ అమ్మ ఎంత అద్భుతమైన బహుమానం పంపిందో చూపిస్తాను!" తనతో నన్ను లాగుకొని ఆయన తొందర తొందరగా ద్వారంవద్దకు వెళ్లారు.

(మిగత 40వ పుటలో)

తీవ్రాలోచనలో (ఎన్. ఎల్. జుకోవ్ చిత్రం)



# సోవియట్ దేశంలో ఎన్నికలు ఎట్లా జరిగాయి?

ఈ ఛాయాచిత్రం గోర్కీ నగరంలో తీయబడింది. ఇంజనీరు ఎ విశ్రాం గృహంలో జరుగు పౌరుగు వారి సమావేశాన్ని చూపుతుంది. ప్రసంగిస్తోన్న ఆమె ఉపాధ్యాయిని ఒ. పనిచేవా. ఆమె తన తోడి ఉపాధ్యాయిని యం. ప్రెద్ తెచెన్‌స్కయా గురించి మాటాడుతూ శ్రోతలకు ఆమె జీవితం గురించి ఆమె నడవడి గురించి సైతం తెలియజేసింది. యం. ప్రెద్ తెచ్‌న్‌స్కయా గురించి అక్కడ నున్నవారు ఎక్కువగా తెలుసుకోవడానికి కుతూహలపడుతున్నారు. ఆమె గోర్కీ నగరం జిల్లా సోవియట్లలో ఒకదానికి సభ్యురాలుగా ప్రతిపాదింప బడింది. ఆమె తోడి పనివారు పాఠశాల సమావేశంలో ఆమె పేరును ప్రతిపాదించారు.



గోర్కీ నగరంపు ఒక జిల్లా సోవియట్‌కు సభ్యురాలిగా ప్రతిపాదించబడిన ఎం. ప్రెద్ తెచెన్‌స్కయాను గురించి సవివరంగా తెలుసుకోవడానికి సమావేశమైనవారంతా ఉత్సాహ పడుతున్నారు

ఎన్నికలకు సుమారు ఆరువారాల ముందుగా యిటువంటి సమావేశాలు ప్రతిచోటా జరుపబడ్డాయి. కార్మికులు, కర్షకులు, ఉద్యోగులూ తమ ఉత్తములైన, అత్యంత గౌరవనీయులైన తమ మిత్రుల నుండి సభ్యులను ఎన్నుకోవడానికి సమావేశమయ్యారు.

తమ గురించి, ఎన్నుకోబడినట్టయితే తాము చేయబోయే పనిని గురించి చెప్పడానికి అభ్యర్థులు కూడా భావిలో ఓటుచేయబోయే పౌరుల నుద్దేశించి ఉపన్యసించారు. తమ విశ్వాసాన్ని అభ్యర్థి సఫలం చేస్తాడా లేదా అన్నది ముఖ్యంగా తెలుసుకొనగోరారు, ఓటర్లు. ఆ పని అతని శక్తికి మించినదని వారనుకున్నట్టయితే, యింకో అభ్యర్థిని ఎంచుకోవడానికి వారు వెంటనే అంగీకారానికి వచ్చేవారు. ఈ విధంగా అనేకసార్లు జరిగింది. ఉదాహరణకు, స్టాలిన్‌గ్రాడ్‌లో ఎన్నికలకు ముందర జరిపిన ఒక సమావేశం వృత్తి పాఠశాల డైరెక్టరు యం. సుఖొనికోవ్ అభ్యర్థిత్వాన్ని తిరస్కరించింది, సభ్యునికుండవలసిన గుణాలాయనకు లేవని. ఈ సమావేశం ఫోర్మన్ వ్లాదిమిర్ యుదిన్‌ను ఎన్నుకోవడానికి నిర్ణయించింది. ఆయన మంచి సాంఘిక సేవకుడు కావడంవల్ల, సానుభూతి, సహకారాలు చూపే వాడు కావడంవల్ల.

అభ్యర్థుల ఆమోదాన్ని పొందిన తరవాత యీ సమావేశాలలో ఓటర్లు తాము ఎంచుకున్న అభ్యర్థులను అభ్యర్థుల జాబితాలో వెయ్యమని జిల్లా ఎలక్ట్రల్ సంఘాలను కోరారు.

మార్చి మూడవతేది వచ్చింది. ఎనిమిది యూనియన్ రిపబ్లిక్కులలో శ్రామిక ప్రజాప్రతినిధుల స్థానిక సోవియట్లను ఎన్నుకునే రోజు. ఇంకో ఆరు రిపబ్లిక్కులలో ఎన్నికలు మరుసటి ఆదివారానికి నిర్ణయింపబడ్డాయి: ఒక యూనియన్ రిపబ్లిక్కుకు రెండువారాల తరవాతకు—అది కూడా ఆదివారమే—నిర్ణయింపబడింది. ఇది యెంత మాత్రమూ యాదృచ్ఛికం కాదు. కార్మిక స్త్రీ పురుషులు యావత్తు మంది పాల్గొనేటందుకుగాను ప్రజాధికార సంస్థలకు ఎన్నికలు సెలవు రోజుల్లో నిర్ణయింపబడతాయి. ఎన్నికలు ఉదయం ఆరు గంటలకు మొదలయి, అర్ధరాత్రప్పుడు ముగుస్తాయి. ప్రతిఓటరు తన వీలును బట్టి ఓటుచేసేందుకు.

కాని సాంప్రదాయాన్ననుసరించి, అందరూ కాకపోయినా ఎక్కువభాగం తమఓట్లు మొట్టమొదట వేయడానికి ప్రయత్నిస్తారు. అతి పెందరాళ వచ్చి ఓటుచేసిన వారిలో 86 ఏళ్ళ వృద్ధుడు అలెక్సీ సెమెనోవిచ్ సెమెనోవ్ ఒకరు. ఈయన జీవితమంతా రైతుగా గడిపారు ఇప్పుడు విశ్రాంతికి అర్హతను సంపాదించి, మాస్కోలో తన కుమార్తెతో వుంటున్నారు.

సమానత్వ సూత్రాన్ననుసరించి ఎన్నికలు జరుపబడుతాయి: అంటే అందరు ఓటర్లకు సమాన హక్కులున్నవని అర్థం; కూలీ సంపాదించేవారుగాని, జీతాలు పొందేవారుగాని, పెన్షన్లు పుచ్చుకునే వారుగాని, విద్యార్థులుగాని ప్రతి ఒక్కరికీ ఒక ఓటు వుంటుంది.

మొదట్లో వోటు వేయడానికి వచ్చినవారిలో ఒకరు, 86 సంవత్సరాల అలెక్సీ సెమినొవిచ్ సెమెనోవ్



జాతివల్లకూడా ఎటువంటి తేడాలూ వుండవు. ఉజ్బెకిస్తాన ముఖ్యపట్టణమైన తాష్కెంట్లో ఓటు చేయడానికి వచ్చినప్పుడు షాక్మద్ షామ్మదోవ్ పెద్ద కుటుంబపు ఛాయాచిత్రాన్ని చూడండి. యుద్ధకాలంలో ఆయన, ఆయన భార్య బక్రీ అక్రమోవా పలుజాతులకు చెందిన పద్నాలుగు మంది పిల్లలను పెంచుకున్నారు. వారిలో కొందరికి ఓటుచేసే వయసు వచ్చింది, తమ తలిదండ్రులతో ఓటింగ్ కు వచ్చారు.

గడియారం పన్నెండు కొట్టినప్పుడు ఎన్నికల సంఘాల సభ్యులు ఓట్లపెట్టెల సీళ్లువిప్పి, ఓట్లను లెక్కపెట్టడం ప్రారంభించారు. మా విలేకరి వాటిని దూరంనుండి మాత్రమే ఛాయాచిత్రం తీయగలిగారు.

ఓట్లు లెక్కిస్తున్నప్పుడు ఆందోళన చెందని అభ్యర్థిగాని, అభ్యర్థినిగాని ఒక్కరూ ఉండరు. సరిగ్గా ఇటువంటి పరిస్థితిలోనే మా ఛాయాచిత్ర గ్రాహక విలేఖరి, సాంఘిక శాస్త్రోపాధ్యాయుడు, మాస్కో

(మిగత 14వ పుటలో)



సరిగ్గా 12 గంటలు కొట్టేసరికి ఎన్నికల సంఘాల సభ్యులు బ్యాలెట్ ↑ పెట్టెల సీళ్లు విప్పారు.



★

←షాక్మక్ షామ్మకోవ్, ఆయన భార్య బక్రీ అక్రమోవా, పలుజాతులకు చెందిన తమ బిడ్డలతో పోలింగు స్టేషన్‌కు వచ్చిన దృశ్యం



చిట్ట వరకు టెలిఫోను మ్రోగింది. మాస్కో నగరపు సోవియట్‌కు అభ్యర్థిగా నిలిచిన ఎ. ద్రొబ్రొదొమోవ్, స్థానిక ఎన్నికల సంఘపు అభినందనల నందుకొన్నారు

# అసాధ్యుడు

## ఎఫ్. కుజనెత్సోవ్

"వీరిన అనతోలీ గురించి ఏదన్నా చెప్పాలా?....నిజం చెప్పాలంటే నాను మనస్కరించడం లేదు."

అందమైన యువతి ఓల్గా ష్చెర్బకోవ్ గొంతులో బాధ స్ఫురించింది.

మేము అప్పటికే యించుమించు ఒక గంటనుండీ కాచుకుని వున్నాము. కాని అనతోలీ ష్చెర్బకోవ్ యింకా అజోవ్ ఉక్కుమిల్లు నుండి తిరిగి రాలేదు. అక్కడతను ఫిట్టరుగా పనిచేస్తున్నాడు.

ష్చెర్బకోవ్ కుటుంబంయొక్క పరిశుభ్రమైన ఇంట్లో అప్పటికే నేనంతా చూశాను. కిటికీలకూ, తలుపులకూ ఉన్న తెరలనూ, మేజా గుడ్డలనూ ఆ గృహిణి కుట్టుపనులతో అందంగా తయారు చేసింది. వారి స్వంత గ్రంథాలయాన్ని—యిది బాగా పెద్దది—చూశాను. దానిలో వైజ్ఞానిక గ్రంథాలు, పాఠ్యగ్రంథాలే కాకుండా, ఫ్యూచిత్వాంగర్, డికెన్స్, గాల్స్‌వర్దీ గ్రంథాలుకూడా వున్నాయి. చక్కని చిలిపి సాషాతో స్నేహంచేశాను. వాడు వాళ్ళనాన్న తనను విమానంలో తీసుకెళ్ళినందుకు ఆయనంటే తనకెంతో ప్రేమ అని నా చెవిలో చెప్పాడు.

ఇంకా అనతోలీ ష్చెర్బకోవ్ రాలేదు.

"మీరు ఆశ్చర్య పడక్కరలేదు. ఆయన తరచు ఆలస్యంగా వస్తారు". అని చెప్పింది అతని భార్య "ఐదేళ్ళ క్రితమే ఆయన అనుకున్న ప్రకారం రాకపోయి వుండినట్టయితేనా...."

ఏదో జ్ఞాపకంవచ్చి చిరునవ్వుతూ ఓల్గా ష్చెర్బకోవా హఠాత్తుగా చెప్పసాగింది:

"...ఇంకా బడిలో చదువుతూ వున్నప్పుడే మాకు పరిచయమైంది ఆయన ఎప్పుడూ గ్లైడర్ల దగ్గర ప్రయాసపడుతూ వుండేవారు. అవి ఎగిరేవి కావు...

వాళ్లు యుద్ధం తరవాత మళ్ళీ కలుసుకున్నారు. అప్పుడతను సేననుండి విడుదలపొందాడు. అందంగా దుస్తులు వేసుకుని గంభీరంగా నగర వీధుల్లో నడుస్తున్నాడు.

"ఈయన యిప్పుడీ విధంగా వున్నారా"అని నాలో నేననుకుని, ఆయనను గుర్తుపట్టనట్టుగా నటించాను"

ఒక వారంరోజులు తరవాత, ఉభయులకూ మిత్రుడైన ఒకాయన ద్వారా పొడవాటి పత్రికలు ఒకటి ఆమెకు వచ్చింది ఆ నెలల్లో యిటువంటి ఉత్తరాలు ఒకగుట్టగా తయారైనాయి. ఓల్గా ఒక డ్రాయరును తెరచి ఒక ఉత్తరాల కట్టను తెచ్చింది. అప్పుడప్పుడు నేనొక ఉత్తరాన్ని తీసి మా ఆయనకు చదివి వినిపిస్తాను:

"దయచేసి నిజం చెప్పు ఓల్గా,—
వినయంలేని యీ కుర్రవానికి
నీ సాహచర్యం లభిస్తుందా?
క్షణమో, ఘడియో కాదు.
ఆమరణాంత సాహచర్యం?"

"'ఇది మీరే వ్రాసేరా?' అని నేను అడిగాను........'ఇప్పుడు మీరు ఒక ఘడియైనా కనిపించరే!' అన్నాను."

ఓల్గా ష్చెర్బకోవా మౌనం ధరించింది; ఆమె ముఖాన్ని విచారం అలముకుంది.

"ఆయనలో యీ మార్పు రావడానికి కారణం ఏమిటి?.... బహుశా యింకో స్త్రీ ...?"అంటూ నవ్వుతూ అన్నాను.

"అదికాదు, అదికాదు"అని బిగ్గరగా అంది ఓల్గా. నా సూచనకు విస్తుపోయి. "కాదు, పురుషుడే. వినండి చెపతాను.



అజోవ్ ఉక్కు కర్మాగారంలో పనిచేస్తోన్న రేషనలైజర్ ఎ. ష్చెర్బకోవ్. తనవలెనే శ్రమ స్వయంకర్తనంలో ఆసక్తి లిగివున్న కార్మికులకు తను నవీనంగా సృష్టించిన సాధనగురించి చెబుతున్నారు

"పెళ్ళయ్యాక ఒక సంవత్సరం అంతా అనతోలీ పద్యాలు వ్రాస్తూనే వున్నారు ఆయన ఫాక్టరీలోని సాహితీ బృందం సభ్యుడు. వారి ప్రచురణలో ఆయన పద్యాలు ప్రచురింపబడేవి; ఆయన సాహితీ సభలో వాటిని చదివేవారు. ఆయనకు ఫాక్టరీ, బ్లాస్ట్ ఫర్నేసులూ, ఓపెన్ హార్తులూ, ఫోర్జింగ్ ప్రెసెస్ అంటే చాలా యిష్టం. ఆయన పద్యాలు, వాటిగురించి వుండేవి. దీనిని వేళాకోళంచేసి నేను యిలా అన్నాను; "మీరు కవిత్వం చదువుతూవుంటే నాచెవుల్లో రొదలూ, గర్జనలూ వినిపిస్తాయి. నేనేదో రైలు కార్ఖానాలో ఉన్నట్టుగా." ఆ కాలంలో ఆయన ఆ కార్ఖానాలోనే ఫిట్టర్ల జట్టుకు నాయకునిగా పనిచేసేవారు.

"ఆ కార్ఖానాలో వాసిలీ దెమ్యనోవిచ్ షిరిన్ అన్న ఒక అద్భుతమైన వృద్ధుడొకాయన వుండేవారు ఆ పరిశ్రమకు వచ్చేటప్పుడు ఆయనొక నిరక్షరాస్యుడైన గ్రామస్తుడు. ఇప్పుడాయన కార్ఖానాకు ప్రధాన ఫోర్మెన్.

"మీకు మన కార్ఖానా అంటే ఎంతో యిష్టమే!" అన్నారాయన అనతోలీతో ఒకరోజున.

"అవునండి!" అని ఆయన జబాబిచ్చారు.

"నాకు లేదు!" అన్నారు షిరిన్.

"ఆయన అనతోలీని చేయిపట్టుకుని చావడిలోనికి తీసుక వెళ్ళారు.

"రైలుపైను కోస్త్రోన్న ప్రెస్సు దగ్గర వారాగారు మూడు సెకండ్లు, వస్తువు బయటికి వస్తుంది మూడు సెకండ్లు—యింకోటి వస్తుంది.

"'మంచి యంత్రమా,'"

"'అవును, అన్నారు అనతోలీ.

"'ఇదో' అనడిగారు షిరిన్ వస్తువులను ప్రెస్సునుండి పిన్సర్లతోలాగి, వాటినొక క్రేట్లో స్త్రోన్న సహాయకుని వేపు చూపుతూ. "ఒక షిఫ్టులో ఆరువందల చెనాలు, ఒక్కొక్క వస్తువు ఏడు కిలోగ్రాములు. చేతితో ఎన్నిటన్నుల లోహాన్ని ఎత్తాలి?'"

"'నలభైకి పైగా.'

"'మీరు దీనిని మంచి యంత్రం అంటారే .. మీరు కవులు కూడానే?'

"కార్ఖానాగుండా షిరిన్‌తో కొన్నిసార్లు నడిచాక అనతోలీ కవిత్వం వ్రాయడం మానివేశారు. ఇంటికి వచ్చాక ఆయన ఆలోచనలో పడతారు, కళ్ళు దేనినో చూస్తుంటాయి ఒక్కమాట కూడా ఆడరు.

"అనతోలీ! మీసూపు చల్లారిపోతోంది!....

"దాంతో ఆయన యదార్థ ప్రపంచంలోనికి వస్తారు తినడం మొదలు పెడతారు. మా ఆయనలో ఏదో లోపంవుందని గ్రహించాను. నేను వృత్తివల్ల వైద్యరంగంలో పనిచేసేదాననయినప్పటికీ, "డిజైనింగు" అన్న వ్యాధి ఒకటుంటుందని ఎన్నడూ అనుమానించలేదు. ఇది నిజంగా భయంకరమైన అంటువ్యాధి. పనినుండి తిరిగివచ్చి గదిలో ఒకమూలనుండి యింకో మూలకు ఆయన పచారీ చేయడం మొదలు పెడతారు. ఆలోచన, ఎప్పుడూ ఆలోచనే. తరవాత గబగబా మేజాదగ్గరకు పరుగెత్తి, యేదో గీయడము మొదలు పెడతారు ...

"'ఫాక్టరీలో యింకా జరిగే కష్టమైన శరీరశ్రమగురించి ఆలోచించు!' అనేవారు. కార్ఖానాలో కార్మికులు నూనె అంటుకున్న గుడ్డలు (ఓవరాల్స్) వేసుకోవడంకన్నా, తెల్లని స్లాక్స్ వేసుకునేటట్టుగా మనం పరిస్థితులను మార్చితే అద్భుతంగా ఉండదూ? వారిచేతులు ఒక అమ్మాయి చేతులంత మృదువుగా వున్నట్టు చేస్తే అద్భుతంగా ఉండదూ.'

"ఒక అర్ధ సంవత్సరం ఆయన ప్రధాన ఫోర్మెన్ షిరిన్‌తోనూ, కార్ఖానా సూపరింటెండెంటు గొలోదోవ్‌తోనూ ప్రెస్సు స్వయం చోదనగురించి పనిచేశారు వారు కార్ఖానా డిజైనర్లు, పరిశ్రమ ప్రధాన డిజైనర్లు సంప్రదించారు. కష్టమైన శరీరశ్రమనుండి ప్రెస్సు ఆపరేటర్ సహాయకుణ్ణి తప్పించేదేదో వాళ్ళు కనిపెట్టారు. వారు పరిశ్రమకు సంవత్సరానికి 167,000 రూబుళ్ళు ఆదా చేశారు. అందుకు వారు ఐదువేల రూబుళ్ల బహుమానాన్ని అందుకున్నారు.

"ఆయన యీ బహుమానం తీసుకుని యింటికి ఛాంపేన్, కేకులు, పళ్లు తీసుకవచ్చారు నేను వడ్డన చేశాను. మేమంతా



ఎ షెస్సవ్. న టుంబంగా

ఆనందించాము, ఆయన విజయం సంపాదించినందుకూ, పనయ్యాక వెంటనే ఆయన యిక యింటికి వస్తారన్న ఆశతోనూ.

"మా అనతోలీ మళ్ళీ ఆలోచనలో పడ్డం నేను మళ్లీ చూశాను.

"'ఏమిటొచ్చింది మళ్లీ?' అని అడిగాను.

"'జ్ఞాపకంవుందా, మాషాపులో ఫిష్‌ప్లేట్లు చేసే పద్ధతి గురించి చెప్పాను. మిల్లునుండి అనేకమీటర్లు అవి కుప్పవేసేచోటికి కార్మికులు యీనాటివరకూ వాటిని లాక్కుని వస్తారు....'

"ఆయనలో యిక ఆశపెట్టుకోకూడదని అప్పుడు నేనుగ్రహించాను. ఇక షిరిన్‌కు అరవైఏళ్ళుదాటాయి ఇప్పటికీ ఆయన అభివృద్ధి చేయడం, యాంత్రికీకరణగురించి తప్పితే యింకేమీ ఆలోచించరు.

"ఒక రోజున పరిశ్రమ గ్రంథాలయంనుండి అనతోలీ పరుగెత్తుక వచ్చారు.

"'నృత్యం చేదాం!' అని ఆయన అరిచారు. 'నేను కనుక్కొన్నాను!'

"'మీరేమిటి కనుకొన్నారు ?' అని నే నడిగాను.

"'ఫిష్‌ప్లేట్లనులాగి కుప్పవేసే యంత్రాన్ని. మనకు కావలసిందల్లా ఒక నడిచే ఎక్స్‌కవేటర్!"

"'మా ఆయనకు పెద్ద జబ్బు వచ్చిందని నాకు యిప్పుడు నమ్మకం వచ్చేసింది.

"'బుద్ధి తెచ్చుకుని మాటాడండి. నడిచే ఎక్స్‌కవేటర్ మీ కెందుకోసం కావాలి ?'"

"'దాని ప్రమాణంలో దానిని పదోవంతుకు తగ్గించి బద్దీలమీద పెట్టినట్టయితే, అది కావలసిన పనిని చేసిపెడుతుంది. ఇక్కడ చూడు!" ఒక కాగితం ముక్క తీసి, నాకు మతిపోయేవరకూ ఆయన ఏదో గీస్తూ మాటాడుకుంటూ పోయేరు.'

"మళ్లీ ఆయన అనేక రాత్రుళ్ళు బల్లదగ్గర గడిపారు.

"కాని ఆయన ఎంత కష్టపడి పనిచేసినా ఆయన యీసారి జయం సంపాదిస్తున్నట్టు కనిపించడంలేదు. ఆయనకు ఉద్దేశమైతే వుంది. కాని లెక్కలు వెయ్యలేక పోతున్నారు. నా సాయం కోరడానికి యిష్టంలేదు. 'ఈసారి అంతా నేనే చెయ్యాలి' అన్నా రాయన.

"ఆయన పాట్లన్నీచూసి, నేను ఊరుకోలేకపోయాను. ఇలా అన్నాను :

"మీరేం చేద్దామనుకుంటున్నారు, ఏడేళ్లు మాత్రమే చదివి, ఇన్వెంటర్ అవుదామనుకుంటున్నారా? కవిత్వమే సాగించండి, అందులో ఏమన్నా రాణిస్తారేమో ?

"ఇలా అని తరవాత వెంటనే విచారించాను.

"ఆయన నావేపు సాభిప్రాయంగా చూసి యిలా అన్నారు :

"నువ్వన్నది నిజం. నేను చదువుకోవాలి."

"కొద్ది నెలల తరవాత లోహ సాంకేతిక నిపుణుల సాయంకాల పాఠశాలనుండి ఆయనొక రిపోర్టు కార్డును తీసుకవచ్చారు. చిరునవ్వుతూ యిలా అన్నారు, 'తలిదండ్రుల సంతకం అన్నచోట నువ్వు సంతకం చేయవలసి వుంది".

"'తొలి పరీక్షలయ్యాక ఆయన కార్డు తీసుకవచ్చి నా సంతకం కోసం నా ఎదుట పెట్టారు.—అది చూశాను : డ్రాఫ్టింగ్—చాలా బాగుంది, పదార్థ విజ్ఞానశాస్త్రం—చాలా బాగుంది; రష్యన్—బాగుంది.

"నేను వెంటనే ఆయనను బల్లదగ్గర కూచోబెట్టాను. ఆయనకు మంచి నోటు పుస్తకం ఒకటి యిచ్చి 'మీకు వ్యాకరణం పూర్తిగా వచ్చేవరకూ డిక్టేషన్ వ్రాస్తూవుండండి. సిగ్గుచేటు—మీరు పూర్వం కవులు, రష్యన్ భాష సరిగారాదు.' "

"డిక్టేషన్ పూర్తిచేసిన తరవాత ఆయన యిలా అన్నారు :

"ఇక నా జాగాలో కూచో, కొద్దిగా లెక్కలు చేద్దాం."

"సుశిక్షితురాలైన మంత్రసానికి లెక్కల అవసరమేమిటి ?"

"నాకు పెద్ద ప్లానులున్నాయి. సాంకేతిక పాఠశాలలో చదువు ముగిసిన తరవాత, సాయంకాల పాఠశాలలో ప్రవేశిద్దామనుకుంటున్నాను. నా భార్య నాకంటె వెనకబడి వుండడం నాకిష్టంలేదు...."

....తలుపుదగ్గర గంట మ్రోగడంవల్ల మా సంభాషణకు అంతరాయం కలిగింది. తలుపు తెరిచాక పిరికిగా చిరునవ్వుతోన్న ఒక పొడవాటి దృఢగాత్రుడు కనిపించాడు. ఆయనచేతుల్లో పళ్ళపొట్లాలూ, ఒక పెద్ద కేకు పొట్లమూ వున్నాయి.

"క్షమించు ఒలెంకా" అన్నారాయన నెమ్మదిగా. "ఆలస్యం అయిపోయింది. కొత్తగా చేసిన అభివృద్ధి కృషికి బహుమానం వచ్చింది. అక్కడ ముసలాయన మొరొజోవును కలుసుకున్నాను. అవతల కార్ఖానాలోని ఫిట్టరును జ్ఞాపకంవుందా. ఆయన గురించి నీకు చెప్పానే....కప్లింగ్ మెకానిజం గురించి యింకా అన్వేషణ సాగుతూనే వుంది. తెలిసిందా...." షెర్బకోవ్ ఒక పొట్లాన్ని అక్కడ పెట్టివేసి, ఖాళీగావున్న చేతితో మొరొజోవ్ పనిచేస్తోన్న మెకానిజం గురించి వివరించుకపోతూ, నన్ను హటాత్తుగా గమనించి, విస్తుపోయి మౌనం ధరించారు.

"ఈయనే, అప్పట్నుండీ మనం కాచుకునివున్న ఇన్వెంటర్ గారు" అంది ఆయన భార్య గంభీరంగా, తన "వినయంలేని" భర్తను నాకు పరిచయం చేస్తూ. కాని ఓల్గా కళ్ళలో ప్రేమ, గర్వమూ వెలుగుతూ వుండడం నాకు కనిపించకపోలేదు.

---

## సోవియట్ దేశంలో ఎన్నికలు ఎట్లా జరిగాయి ?

(11వ పుట తరువాయి)

నగర సోవియట్‌కు అభ్యర్థి అయిన ఎ. ఎ. దొబ్రొదొమోవ్‌ను ఆయన యింట్లో, బాగా రాత్రిపడ్డాక కలుసుకున్నారు. అప్పుడు చిట్టచివరికి టెలిఫోను మ్రోగింది. స్థానిక ఎన్నికల సంఘం ఆయనను అభినందించింది.

అన్ని జిల్లాలలోనూ ఎన్నికలు ముగిసిన తరవాత వార్తా పత్రికలలో చివరి ఫలితాలు ప్రచురింపబడ్డాయి. పదిహేను లక్షలమందికి పైగా ప్రజల ఉత్తమ పుత్రీపుత్రులు స్థానిక సోవియట్లకు సభ్యులుగా ఎన్నుకోబడ్డారు; మళ్ళీ ఎన్నికలు జరిగేదాకా వారు ప్రభుత్వ శాఖలలో తమ ప్రభుత్వానికీ, ఓటర్ల వ్యక్తిగత ప్రయోజనాలకూ ప్రాతినిధ్యం వహిస్తారు. ఎవరైనా సభ్యునిగా తన బాధ్యతలను విస్మరించినట్టయినా, ఆ బాధ్యతలను నెరవేర్చలేకపోయినా, అధిక సంఖ్య వోటర్ల నిర్ణయానుసారంగా, కాల పరిమితికి ముందుగానే పదవినుండి తొలగింపబడుతాడు, ప్రజల విశ్వాసానికి అధికతరంగా అర్హుడైన యింకొకరు ఆయన స్థానంలో వస్తారు.

# అజర్‌బైజాన్ నూనె పరిశ్రమ పురోగమనం

## అజర్‌బైజాన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ నూనె పరిశ్రమ మంత్రి ఎస్. వెజిరోవ్‌తో సంభాషణ

యూనియన్ రిపబ్లిక్‌ల హక్కులను అధికం చేయడానికి సోవియట్ యూనియన్‌లో విస్తృతమైన చర్యలు తీసుకోనబడుతున్నాయి. ఈ చర్యలు గొప్ప ఆర్థిక లాభాలను చేకూర్చుతాయి. స్థానికసంస్థల ఉద్యోగులలోని చొరవను పెంపొందజేస్తాయి. జాతీయ రిపబ్లిక్‌ల ప్రజల ఆర్థిక, సాంస్కృతిక పురోభివృద్ధికి మరింత దోహదం చేస్తాయి.

1954 వేసవిలో అజర్‌బైజాన్ జాతీయ ఆర్థిక రంగంయొక్క ప్రధానశాఖ—నూనె పరిశ్రమ—యూనియన్ రిపబ్లిక్ అధికారం క్రిందికి మార్చబడింది. దాని వ్యవహారాలను చూడడానికి మా రిపబ్లిక్‌లో నూనె పరిశ్రమ మంత్రాంగాన్ని ఒకదానిని మేము యేర్పాటు చేశాము.

అజర్‌బైజాన్‌లో ఇదివరకు నూనె పరిశ్రమ సంస్థల పెద్ద సంఘాలు కొన్ని ఉంటుండేవి. ఆ సంఘాలన్నీ మాస్కోలోవున్న సోవియట్ దేశ మంత్రాంగం యొక్క యేదో ఒక కేంద్రబోర్డు ఆధిపత్యంలో ఉంటుండేవి. ఈ సంఘాల పని సందర్భాలలో ఉత్పన్నమవుతూవచ్చిన సమస్యలన్నీ—అవి స్వల్పమైనవైనాసరే—మాస్కోతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడంద్వారా పరిష్కరింపబడేవి.

మా రిపబ్లిక్‌లో, సముద్రగర్భంలో నిక్షిప్తమైయున్న నూనెను తోడడం సమస్య గొప్ప ప్రాముఖ్యతను వహిస్తున్నది. సముద్రాంతర్భాగంలో అతిలోతున ఉన్న నూనె ప్రాంతాలనుండి నూనెను తీసేప్పుడు ఇక్కడ మేము అనేక కష్టాలను యెదుర్కొనవలసి వస్తున్నది. అలాంటి సమస్యలు ప్రధానంగా, ప్రజాసంస్థలచేత, పని జరుగుతున్న స్థలంలోనే నిర్ణయింపబడుతూ ఉండడం మూలాన మేము గొప్ప ఫలితాలను సాధించగలిగాము.

రిపబ్లిక్ యొక్క నూనె పరిశ్రమ మంత్రాంగశాఖ గట్టి వైజ్ఞానిక పునాదిని కలిగి ఉన్నది. దాని ఆధిపత్యంలో నూనెతోడడం, పరిశుభ్రపరచడం పనులలో కృషిసల్పుతున్న ఆరు విజ్ఞానశాస్త్ర పరిశోధనా సంస్థలు, డిజైనింగ్ సంస్థలు వున్నాయి. ఈ విద్యాసంస్థల నిర్వహణ బాగా కొనసాగుతున్నది. అవి జరపే కార్యకలాపాలు బాగా అభివృద్ధిలోకి వచ్చాయి. ఆ సంస్థలు జరిపే ప్రతి పరిశోధన నూనె పరిశ్రమలో సంపూర్ణంగాను, త్వరితగతిని అమలుజరుపబడుతున్నది. ఈ వైజ్ఞానిక పరిశోధనా సంస్థలు, డిజైనింగ్ సంస్థలు అజర్‌బైజాన్ నూనె పరిశ్రమయొక్క అవసరాలను తీర్చడమేగాక, ఇతర నూనె పారిశ్రామిక ప్రాంతాల యంత్రాగారాలనుండి, ప్రజాతంత్ర ప్రజాస్వామ్య దేశాలనుండి వచ్చే ఆర్డర్లను గూడా తీసుకొని పూర్తిచేస్తున్నాయి. మా వైజ్ఞానిక పరిశోధనా సంస్థల సహాయంతో మేము విజ్ఞానశాస్త్ర, ఇంజినీరింగ్ రంగాలలో సాధింపబడిన అధునాతన విషయాలను నూనె పరిశ్రమలో ప్రవేశపెట్టడంలో గొప్ప కృషిని జరిపాము నూనె నిధులను బయటికి తీయడంలో అధునాతన పద్ధతులు—వివిధస్థాయిల అధునాతన హైడ్రాలిక్ బ్రేకులు, నూనె గనుల ముఖద్వారాలలో డ్రాపకాల ప్రయోగం మొదలైనవి—విస్తృతముగా ప్రవేశపెట్టబడుతున్నాయి. గడిచిన ఒక్క సంవత్సరంలోనే ఈ అధునాతన పద్ధతులద్వారా ఇరవై లక్షల టన్నుల నూనెను అధికముగా తీయడం సాధ్యమయినది.

కొత్త నూనెగనులనుంచి నూనెను తోడడం పనిలో ప్రవేశపెట్టబడిన నిర్మాణ సంబంధమైన కొన్ని మార్పులను తెలియజేస్తాను. గొప్ప అవకాశాలు కలిగివుండి గమనార్హమైన విజయాలను సాధించిన మండలాలలో మేము మా శక్తుల నన్నిటిని కేంద్రీకరించాము. పరిశ్రమలు వినియోగ పడడానికి ప్రాస్పెక్టర్లు కొన్ని కొత్త నూనె గనులను సంసిద్ధ పర్చారు. పారిశ్రామిక ప్రాముఖ్యతను కలిగివున్న నూనె నిధులు గల కొత్త ప్రాంతాలు భూమిమీద, సముద్ర గర్భంలోను కూడా కనుగొనబడ్డాయి.

పూర్వం అజర్ బైజాన్ నూనె పరిశ్రమకు సంబంధించిన నిర్మాణ సంస్థలు విడివిడిగా వుండేవి. వాటిలో కొన్ని సోవియట్ దేశ మంత్రాంగం అధికార పరిధిలో వుంటుండేవి. ఇందు మూలంగా అన్నిటికంటే ముందుగా జరుగవలసిన పనులలో జాప్యం జరుగుతూ వుండేది. ఇప్పుడు అజర్‌బైజాన్ మంత్రాంగం ఆధిపత్యంలో పనిచేస్తున్న మూడు పెద్ద నిర్మాణసంస్థలు వున్నాయి. ఈ సంస్థలు స్థానిక పరిస్థితులను, యంత్రాగారాలు, శ్రామిక ప్రజల అవసరాలను గమనికలోనికి తీసుకొని మరింత శ్రద్ధ వహించగలుగుతున్నాయి.

పైన ఉదహరించిన ఈ అనుకూల పరిస్థితులన్నీ ఉత్పత్తిలోను, ఆర్థిక రంగంలోను తగినంత అభివృద్ధిని తీసుకురావడానికి తోడ్పడ్డాయి.

యంత్రాగారాలనిర్వహణ విషయంలో వచ్చిన అభివృద్ధికరమైన మార్పుల మూలంగా అనవసరమైన ఖర్చులు చాలా తగ్గిపోయాయి. డబ్బు మరింత పొదుపుగా వాడబడుతున్నది. వస్తు సంపద సంపూర్ణంగా వినియోగింప బడుతున్నది. ఇందుమూలంగా నూనె ఉత్పత్తి ఖర్చులు గడిచిన కొద్ది సంవత్సరాలలో చాలా మట్టుకు తగ్గాయి. ఈ విధంగా అజర్‌బైజాన్ నూనె పరిశ్రమ, గడిచిన ఒక్క సంవత్సరంలోనే అంచనా వేయబడిన దానికంటే 87 మిలియన్ రూబుళ్ళను యెక్కువగా ఆర్జించింది.

అజర్ బైజాన్ నూనె పరిశ్రమను పెద్ద సమస్యలు యెదుర్కొంటున్నాయి ఈ సంవత్సరపు కార్యక్రమంలో, భూమిమీద, సముద్ర గర్భంలోను వున్న నూనె ప్రాంతాలను ఉపయోగంలోకి తీసుకురావడానికి ఉద్దేశింప బడుతున్నది, యంత్రాగారాల నిర్మాణాలను విస్తృతం చేయడానికీ, శ్రేష్ఠమైన నూనెను ఉత్పత్తి చేయడానికి గూడా ఉద్దేశింపబడుతున్నది. నూనె పరిశ్రమలో ఉపయోగించడానికి కొత్త రకపు యంత్రాలను నిర్మించడం కూడా ఈ కార్యక్రమంలో ఒక అంశం, రిపబ్లిక్ యొక్క నూనె పరిశ్రమలోని అన్ని శాఖల సాంకేతిక స్థాయిని పెంపొందించడానికి గూడా ఉద్దేశింప బడుతున్నది.





మాస్కో విశ్వవిద్యాలయంలో రష్యన్ భాషను అధ్యయనం చేస్తోన్న శ్రీ కేసరి నారాయణ్ శుక్లా

# మాస్కో విశ్వవిద్యాలయంలో రష్యన్ భాషను అధ్యయనంచేస్తున్న ప్రొఫెసర్ శుక్లా

ఎస్. బుల్కిగిన్, వై. జనరలోవ్

మాస్కో విశ్వవిద్యాలయంలో, విదేశీయులకొరకు రష్యన్ భాషా శాఖ ఒకటి వుంది. దీనిలో పదిదేశాలకు చెందినవారు కనిపిస్తారు. ఇటీవల ఎనిమిదిమంది భారతీయులు యీ శాఖలో చదవడానికి నిశ్చయించుకున్నారు. వీరు వివిధ వయస్సులకు, వృత్తులకు చెందినవారు. విభిన్నమైన పరిస్థితులు వీరిని మాస్కోకు తీసుకవచ్చాయి. వీరిలో ఒక్కొక్కరి జీవితకథ చాలా కుతూహలాన్ని రేకెత్తిస్తుంది. కాని ప్రస్తుతం వీరిలో ఒక్కరి గురించి మాత్రమే ప్రస్తావిస్తున్నాము. ఆయన ప్రొఫెసర్ కేసరి నారాయణ్ శుక్లా. లక్నో విశ్వవిద్యాలయానికి చెందినవారు. ప్రొఫెసర్ శుక్లా "శాశ్వత విద్యార్థి"నని తన్ను గురించి తాను వేళాకోళ మాడుకుంటారు. విషయమేమిటంటే మాస్కోకు రావడానికి ముందర ఆయన లక్నోలోనూ, బెనారెస్‌లోనూ, లండన్‌లోనూ చదివారు.

* * *

మా మొదటి ప్రశ్న —రష్యన్లోనే అనుకోండి— "బాగా చదువుతున్నారా ప్రొఫెసర్‌గారూ!" అని.

"ఫరవా లేదు" అని ప్రొఫెసర్‌గారు జవాబు చెప్పారు, రష్యన్లోనే. ఇది వినయోక్తి: ఎందువల్లనంటే ఆయనకు రష్యన్ భాషను బోధిస్తోన్న దోసెంట్ ఇల్సా పుల్కినా ఆయన అభివృద్ధికి చాలా సంతోషించారని మాకు తెలిసింది. విదేశీయులకు రష్యన్ భాషను బోధించడంలో ముప్ఫయ్యేళ్ళ అనుభవం గలవారు కావడంచేత, యీ విషయాన్ని నిర్ణయించడానికి ఆమె బాగా సమర్థురాలు.

"మొదట నేను రష్యన్ భాషను బాగా నేర్చుకోవాలి" అంటూ చెప్పారు మాకు ప్రొఫెసర్ శుక్లా. "ఆతరవాత రష్యన్ సారస్వతాన్ని బాగా చదువుతాను. స్వదేశానికి వెళ్ళాక, లక్నో విశ్వవిద్యాలయంలో రష్యన్ భాషా సారస్వతాలను బోధించాలనుకుంటున్నాను."

ప్రొఫెసరును చూడడానికి మేము వెళ్లాము. విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్న అందరివలెనే, ఆయన సదుపాయమైన ఒక చిన్న గదిలో వుంటున్నారు. ప్రసిద్ధ ప్రాచీన రచయితలవీ, అధునాతన సోవియట్ రచయితలవీ చాలా గ్రంథాలు ఆయన పుస్తకాల అలమారాలలో వున్నాయి.

"వీటన్నిటినీ నేను రష్యన్లో చదవాలనుకుంటున్నాను" అన్నారాయన, పుస్తకాలను ప్రేమగా తాకుతూ.

# మిత్రులకు లేఖ



మాస్కోలోని సెర్ప్ ఇ మోలోత్ ఇనుము ఉక్కు పరిశ్రమ కార్మికులకు, భిలాయ్‌లోని నిర్మాణ కార్మికులకు మధ్య సన్నిహితమైన స్నేహ సంబంధాలున్నాయి. సెర్ప్ ఇ మోలోత్ పరిశ్రమ రాయబారుచ భిలాయ్‌లో ఒక ఇనుము, ఉక్కు పరిశ్రమ నిర్మాణానికి సాయపడుతున్నారు. మాస్కో పరిశ్రమ క్లబ్బు భారతీయ యువజనులు మాస్కో యువజనులకై పంపిన వివిధ బహుమానాలను అందుకుంది.

....భారత-సోవియట్ మైత్రి గౌరవార్థం జరిపిన విందు సందర్భంగా యీ పరిశ్రమ యువ కార్మికులు ఒక సాయంత్రం తమ క్లబ్బులో సమావేశమయ్యారు. ఈ సమావేశం చాలా ఉల్లాసంగా సాగిపోయింది. హాలు, ప్రసారాలూ భారత దేశపు త్రివర్ణ పతాకాలతో అలంకరింపబడ్డాయి. సంస్కృతీ కార్యక్రమంలో భారతీయ గీతాలూ, నృత్యాలూ ఒకభాగంగా ఉన్నాయి. అందమైన శిరోజాలు గల రష్యన్ బాలికలతో నృత్యం చేశారు, భారతీయ అతిథులు. ఉత్సాహపూరితులైన భారతీయబాలలు ఒకరిపద్దనుండి ఒకరిపద్దకు తిరుగులాడారు. ఛార్జ్ డి అఫైర్స్ అడ్ ఇంటెరిమ్ శ్రీ పి రత్నం సమావేశంలో ప్రసంగించారు:

"మా పట్ల మీకు గల ఉన్నత సద్భావాల నిది తెలియజేస్తుంది, భారతీయ సంస్కృతిలో మీకు గల గాఢమైన అసక్తిని విదితం చేస్తుంది."

విందు ముగుస్తువుండగా భారతీయ యువజనులకు పంపేందుకు, యువకులైన ఇనుము, ఉక్కు కార్మికులు ఒక లేఖను వ్రాసేరు. ఇది భిలాయ్ ఇనుము, ఉక్కు కార్మికులకు ఉద్దేశింపబడింది. వారీ విధంగా వ్రాసేరు:

ప్రియమిత్రులారా!

సెర్ప్ ఇ మోలత్ ఇనుము, ఉక్కు పరిశ్రమ యువకార్మికులమైన మేము—భారత-సోవియట్ మైత్రి గౌరవార్థం యిక్కడ సమావేశమయ్యాము—మీకు మా హృదయపూర్వకమైన, సోదర అభినందనలను పంపుతున్నాము. మన దేశాల యువజనుల, ప్రజల మైత్రి సర్వదా దృఢతరమవుతున్నందుకు మేము హృదయపూర్వకంగా ఆనందిస్తున్నాము. భారత సముద్రపు లోతువలె యీ మైత్రి లోతయినది, ప్రపంచంలోని అత్యున్నత పర్వతాలయిన పామీర్ల మీదుగానూ, హిమాలయాల మీదుగానూ మేము మా హస్తాలను సారిస్తున్నాము, హృదయపూర్వకంగా మీతో కరచాలనం చేసేందుకు.

నల్లని యుద్ధమేఘాలు కాక నీలాకాశమూ, తేజోమయుడైన సూర్యుడు సర్వదా మన కెగువగా ఉండేందుకుగాను, తుపాకిగుళ్ళు తయారు చేయడంకాక పూలు వికసించేందుకూ, ధాన్యం పండేందుకూ, బాంబులు తుపాకి గుళ్ళు ప్రేలడానికి బదులుగా మనకు సర్వదా పిల్లల కేరింతలూ, నవ్వులూ వినిపించేందుకూ మీరూ, మేమూ ఉభయులమూ శాంతియుత శ్రమ జీవనంలో నిమగ్నులమై ఉన్నాము.

మనం లోహాన్ని ఉత్పత్తి చేయాలని వాంఛిస్తున్నాము—యుద్ధసాధనాలకొరకు కాదు, జీవితం సులభతరంగానూ, సుఖతరంగానూ గడిచేటట్టు చేసే వ్యవసాయ యంత్రాలు, కార్లు, లేత్‌ల కొరకు.

ఒక దేశపు ఆర్థిక స్వాతంత్ర్యమంటే ఏమిటో, మాతృభూమి శ్రేయస్సు కొరకు ఆనందంగా చేసే కృషి ఫలితాలంటే ఏమిటో మాకు తెలుసును. దృఢమైన, ఆర్థికంగా సౌభాగ్య వంతమవుతోన్న నవభారత నిర్మాణంలో మీరు సాధిస్తోన్న ప్రతి ఒక్క విజయమూ మీకు ఎంతో ఆనందాన్నిస్తోంది. ఇనుము, ఉక్కు పరిశ్రమ నిర్మాణంలో తోడుపడడానికి భిలాయ్‌కి వెళ్లాలని మా ప్రజలు ఎంతమంది ఉద్యుక్తులయ్యారో, బహుశా మీకు తెలిసివుంటుంది; మీతో కలసిమెలసి పని చేస్తోన్న సోవియట్ ప్రజలలో మా పరిశ్రమకు చెందిన ప్రవీణులున్నందుకు మేమెంతో ఆనందిస్తున్నాము.

మాస్కో యువజనులందరివలెనే మా పరిశ్రమ యువజనులిప్పుడు, మాస్కోలో జూలై 28 నుండి ఆగస్టు 11 వరకూ జరుగబోయే ప్రపంచ యువజన, విద్యార్థి ఉత్సవానికి సన్నాహాలు చేస్తున్నారు. శాంతిస్నేహాల కంకితమైన యీ మహోత్సవంలో ప్రపంచమంతటినుండీ ముప్ఫయివేల మందికి పైగా యువతీయువకులు పాల్గొంటారని మీ కిప్పటికే తెలుసును. వివిధ దేశాలకు చెందిన యువజనులచే కళా, క్రీడా ప్రదర్శనలూ, యువజనులకు సంబంధించిన విషయాల గురించి యువతీయువకుల మధ్య సమావేశాలూ ఉత్సవ కార్యక్రమంలో వుంటాయి; వివిధ ప్రదర్శనలు జరుగుతాయి, సినిమా ఉత్సవాలు మొదలైనవి జరుపబడతాయి. మీ దేశంనుండి కూడా ఒక యువజన ప్రతినిధివర్గం ఉత్సవానికి రాగలదని ఆశిస్తూ మేము యెదురు చూస్తున్నాము. ఈ ప్రతినిధి వర్గానికి ప్రతి చోటా హృదయపూర్వకమైన సుస్వాగతం యివ్వబడుతుందనడానికి సందేహించ నక్కరలేదు. భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమ యువనిర్మాతలు కొందరు ప్రతినిధి వర్గంలో సభ్యులుగా వస్తే మేమెంతో సంతోషిస్తాము.

ప్రియమిత్రులారా, మీ కృషిలో మీకు గొప్ప విజయం ప్రాప్తించాలని ఆశిస్తున్నాము.

హృదయపూర్వక అభినందనలతో,

సెర్ప్ ఇ మోలత్ పరిశ్రమ
ఇనుము, ఉక్కు కార్మికులు.



"సెర్ప్ ఇ మోలాత్" కర్మాగారపు క్లబ్బు భారత సోవియట్ మైత్రి సమావేశంలో ప్రసంగిస్తున్న ఛార్జ్ డి అఫైర్స్ శ్రీ పి. రత్నం



# బేలయ తీసా తీరాన



మనోహరమైన బేలయతీసా లోయ



బేలయ తీసా అన్ని భౌగోళిక చిత్రపటాలలోను కనబడదు. అది ఒక చిన్న నది. తీవ్రమైన వడితో కార్పాతియన్సునుండి ప్రవహించే యీ నది సోవియట్ దేశ పశ్చిమదిశలో పూర్తిగా చివరనున్న సుందరమైన ట్రాన్స్ కార్పాతియా ప్రాంతంలో వున్నది. బేలయ తీసా లోయ వేసవికాలంలో అత్యంత మనోజ్ఞంగా వుంటుంది.

ఈ ప్రాంతంలో ట్రాన్స్ కార్పాతియన్ ఉక్రేనియన్లు నివసిస్తున్నారు. వీరు అత్యంత శాంతియుతమైన కృషిలో—వ్యవసాయం, అడవులను నరికి కలప తయారు చేయడంలో—నిమగ్నులై వున్నప్పటికి గొప్ప సాహసవంతులు. ట్రాన్స్ కార్పాతియా జనాభా అంతా కలసి 900,000 వుంటుంది.

అడవులు ఈ భూభాగపు సంపదగా ఉంటున్నాయి. సిందూర వృక్షాలు, స్ప్రూస్, బీచ్, హార్న్ బీమ్, నట్ చెట్లు ఇక్కడ ప్రధానంగా పెరుగుతాయి. వీటి కలపతోనే సోవియట్ దేశమంతా పేరుబడ్డ ట్రాన్స్ కార్పాతియన్ ఫర్నిచరు అందమైన డిజైన్లలో తయారు చేయబడుతుంది. ఇవి అధికకాలం మన్నుతాయి.

సోవియట్ ఉక్రేనియాతో లీనం కావాలన్న ట్రాన్స్ కార్పాతియన్ ఉక్రేనియన్ల కలలు పన్నెండు సంవత్సరాల క్రితం నిజమయ్యాయి. ఈ కొద్దిపాటి కాలంలోనే ట్రాన్స్ కార్పాతియాలో గొప్ప మార్పులు సంభవించాయి. ఇది వరకు వుంటూ వచ్చిన అర్ధ—చేతిపనుల కర్మాగారాల స్థానంలో పెద్ద కలపపని యంత్రాగారాలు, ఫర్నిచర్ ఫ్యాక్టరీలు, కలప కోత మిల్లులు వెలిశాయి. కలప ఉత్పత్తి మూడు రెట్లు యెక్కువయింది. కలప కర్మాగారాలలో పని పూర్తిగా యాంత్రికీకరణం చేయబడ్డది. ట్రాన్స్ కార్పాతియన్ కలప పనివారు నేడు విద్యుత్ రంపాలను, స్కిడ్డింగ్ వించిలను, ట్రాక్టర్లను, లోడింగ్ క్రేన్లను, తదితర శక్తివంతమైన యంత్రాలను ఉపయోగిస్తున్నారు.

సోవియట్ పరిపాలనా కాలంలో ట్రాన్స్ కార్పాతియా ప్రజల జీవితం, పోల్చుకోడానికే వీలులేనంతగా మారిపోయింది. ఈ దిగువనుదహరిస్తున్న అంకెలు ఆ విషయాన్ని స్పష్టంగా రుజువు చేస్తాయి. పది సంవత్సరాల కాలంలో ట్రాన్స్ కార్పాతియన్ గ్రామీణ ప్రాంతాలలో 26,000 కొత్త నివాసస్థలాలు నిర్మింపబడ్డాయి. అనగా ఈ ప్రాంతంలో ఇది వరకు ఒక శతాబ్దకాలంలో నిర్మింపబడ్డన్ని ఇండ్లు ఈ కాలంలో నిర్మింపబడ్డాయన్నమాట. ఈ మండలంలో నేడు రెండు వందలకుపైగా సినిమా ప్రొజెక్టర్లు వున్నాయి. 1945 వ సంవత్సరంలో ఈ ప్రాంతంలో సినిమా ప్రొజెక్టర్లు చాలా కొద్దిగా మాత్రమేవుండేవి. నిరక్షరాస్యత పూర్తిగా తొలగింప బడింది.



# సోవియట్ చిత్రకారు

బి. నెమెన్స్కి,
(చిత్రక

ఇటీవల మాస్కోలోని గ్రాండ్ క్రెమ్లిన్ భవనంలో జరిగిన సోవియట్ దేశ చిత్రకారుల ప్రథమ మహాసభ, సోవియట్ సంస్కృతీ జీవితంలో ఒక గణనీయమైన ఘటన. ఇతర దేశాలలోని చిత్రకారులైన మా స్నేహితులు యీ మహాసభ కార్యకలాపాలను శ్రద్ధగా గమనించారు కూడా.



సోవియట్ దేశంలోని సకల ప్రాంతాలకు చెందినవారూ యీ మహాసభకు వచ్చారు. వారు విభిన్న కళాశైలులవలంబించే వారైనప్పటికీ, తమ కళద్వారా ప్రజలకు సేవ చేద్దామన్న సమిష్టి ఆశయం గలవారు.

మహాసభలో చాలా కొత్త స్నేహాలు ఏర్పడ్డాయి. పాత స్నేహితులు మళ్ళీ కలుసుకున్నారు. సిద్ధహస్తులైన చిత్రకారులు తమ పూర్వపు శిష్యులను కలుసుకున్నారు. ఈ శిష్యులు వయసులో చిన్నవారే అయినా యిప్పుడు ప్రసిద్ధులైన చిత్రకారులు. సమావేశమందిరంలోనూ, వెలుపలా తక్షణ కళాసమస్యలపైని తీవ్ర చర్చలు సాగుతూ వుండడం మేముచూశాము. కళాకారులు కలుసుకున్నప్పుడు యిటువంటి సమస్యలు అనేకం వుండక తప్పదుగదా. మహాసభకు వచ్చిన అతిథులలో కవులూ, సోవియట్ సైనికోద్యోగులూ, గాయకులూ, ఫాక్టరీ కార్మికులు, రచయితలూ, విజ్ఞానశాస్త్రజ్ఞులూ వున్నారు.





మహాసభకు ముందర, కళాప్రపంచానికి సంబంధించిన ప్రధాన సమస్యలు చిత్రకారుల సకల సంఘాలలోనూ, సమావేశాలలోనూ, పత్రికలలోనూ, రేడియోలోనూ చర్చింపబడ్డాయి. ఈ వివాదాలలో పాల్గొనకుండా ఎవ్వరూ ఉండలేదు.



మహాసభలో చర్చింపబడిన ముఖ్య విషయాలు ప్రజల జీవితంలో లలితకళల స్థానం, పాత్ర: జీవితానికి, ప్రజల శ్రేయస్సుకు సంబంధములేని ఆకార ప్రాధాన్యవాదానికి లేదా సహజవాదానికీ భిన్నంగా కళలు సందేశాత్మకంగానూ కారుణికంగానూ వుండవలసిన ఆవశ్యకత

"సామ్యవాద వాస్తవికత కృత్రిమత్వాన్ని గాని అనుకరణనుగాని సహించదు" అన్నారు మహాసభలో చేసిన తన ప్రసంగంలో రష్యన్ శిల్పులలో వృద్ధులైన సెర్గీ కొనెన్కోవ్. "ఆకార ప్రాధాన్యవాదులకూ, సహజవాదులకూ యిది మా జవాబు ...కళారచనలకు బదికర్ర వాళ్ళు రూళ్ళకర్ర సూత్రాలను ఉపయోగించి, అసహజంగా భావోద్వేగ లతనుండి ఉద్భవించిన ఉత్ప్రేక్షాప్రయోగానికి కళాకారునికిగల హక్కును కాదన్నవారు కళాకారుని సృజనాత్మక విధిని సంకుచిత పరుస్తారు, అతని సాహసిక ఊహా విహారానికి అడ్డంకులు కల్పిస్తారు...."

సామ్యవాద వాస్తవికతను యింకా పెంపొందించడం గురించి చర్చ, మహాసభలో చర్చింపబడిన ప్రధాన విషయాలలో ఒకటి. సామ్యవాద వాస్తవికత అంటే శైలిలో పొందిక్యమూ, దానికితోడుగా ఉత్సాహభరితమైన హృదయమూనని చాలామంది వక్తలు ప్రకటించారు. అది విప్లవకరమైన నవ్యతకూ (రొమాంటిసిసం) లేదా సాంకేత వాదానికీ వ్యతిరేకంకాదు; అనేక ప్రగాఢమైన సమ్మేళనం, అది కళలోని అత్యున్నత వాస్తవిక, వీరోచిత వస్తువు కలసిన సమ్మేళనం. అతి విభిన్నమైన శైలులూ, వేరువేరు వ్యక్తిగత దృక్కోణాలూ దానిలో గర్భితంగా వుంటాయి.

మహాసభ సందర్భంలో జరిగిన ప్రదర్శ



# ల ప్రథమ మహాసభ

## ఎ. దుబిన్‌ఛిక్

ారులు)

నలు, పూర్తిగా విభిన్న శైలులకు చెందిన కళాకారుల చిత్రాలు ప్రజల అభిమానాన్ని చూరగొన్నాయని తెలియ జేస్తున్నాయి. సర్యాన్ చిత్రించిన సుస్పష్టమైన తైలచిత్రాలను కొందరు ఆనందించారు; కొందర్ని దెయ్‌కోవ్ చిత్రాలు ఆకర్షించాయి; సమకాలీన దృశ్యాలపట్ల గాఢాభిమానంగల ప్రకృతి చిత్రకారుడు నిస్కీ యొక్క ఉత్తేజకరమైన, అద్భుతమైన నవ్య తైలచిత్రాల ముందు ఆగి కొందరు చూశారు.

రష్యన్ చిత్రకళలోనూ, ప్రపంచ చిత్రకళలోనూ ఉత్తమమైన వాటిని ఎక్కువ శ్రద్ధతో ప్రచారం చేయాలని, మహాసభలో వక్తలు వక్కాణించారు కూడా. ఉన్నత కళాభిరుచిని ప్రజాసామాన్యానికి కలుగజేయవలసిన ఆవశ్యకత గురించికూడా ఎక్కువగా చెప్పబడింది. నేడు మా దేశంలో కళాభిమానం ఎక్కువగా వుంది; ఒకప్పుడు నిరక్షరాస్యతనూ, అజ్ఞానాన్నీ తొలగించుకోవడానికి వాంఛ వున్నంతబలంగా వుంది. జీవితాన్ని రసమయంగా చేసుకోవాలన్న వాంఛ. చలనం లేక, శైతల్యంతో కూడివున్న చిత్రరచననూ, ఆడంబరాన్నీ— యివి మా కళలో వుంటూ దాని అభివృద్ధిని నిరోధిస్తున్నాయి —చిత్రకారులు తీవ్రంగా విమర్శించారు. ఉత్సాహవిరహితమైన, ఆడంబరపు రచనలతో కొందరు చిత్రకారులు మా కళలకు చేసిన కీడు గురించి కొందరు ప్రసంగించారు. దురదృష్టవశాత్తు యీ రచనలకు తరచు విపరీతంగా ప్రశంసలు వస్తున్నాయి. ఇది బహుశా, యావత్తు సోవియట్ కళగురించి తప్పుడు అభిప్రాయాన్ని కలిగించి వుంటుంది.

ఉత్తమ సోవియట్ కళలో నిజాయితీ, సత్యం, ఉదాత్త కారుణికత సర్వదా గర్భితమై వున్నాయి.

సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి ద్మిత్రీ షెపిలోవ్ ఉపన్యాసాన్ని మహాసభ గొప్ప ఆసక్తితో విన్నది. సోవియట్ కళను యింకా పెంపొందింప జేయడానికి యావచ్ఛక్తినీ ఉపయోగించమని అక్కడున్న వారిని హెచ్చరిస్తూ, అధికంగా జీవితానుగుణ్యమైన, గాఢంగా మానవతగల కళ, అభివృద్ధికర భావ బంధురమైన, మానవ హృదయ ప్రేమ భరితమైన కళ మా ప్రజలకు అవసరమని ఆయన ఉద్ఘాటించారు.

సామ్యవాద వాస్తవికత గురించి కళా వ్యక్తిత్వ వికసనం గురించి ద్మిత్రీ షెపిలోవ్ తమ ప్రసంగంలో యెక్కువగా చెప్పారు. కళా వైవిధ్యమూ, పలు కళారూపాలూ, కోణాలూ, శైలులూ సామ్యవాద వాస్తవికతకు వుంటవని ఆయన ఉద్ఘాటించారు. సామ్యవాద వాస్తవికతా కళ ప్రజల ఆశయాలను యీడేర్చుతుంది: యిది వారి జీవితాలను సంపత్కరంగానూ, శోభాయమానంగానూ చేస్తుంది.

మహాసభను సమాప్తంచేస్తూ చేసిన తన ప్రసంగంలో సెర్గీ కొనెన్కోవ్ ఇలా చెప్పారు:

"మనలో ఒకొక్కరికో ఒకొక్క వెలుగురవ్వ వుంది. మనమంతా కలసినట్టయితే— అనేక జ్వాజ్వల్యమానమైన దీపశిఖ అవుతుంది! మనమెంతో సాధించగలుగుతాము! మన పక్షాన సకల ప్రపంచ అభ్యుదయ చిత్రకారు లున్నారు. మనం ఒకరి కొకరం ఉత్తేజాన్ని యిచ్చుకుందాం....పురోగమింపుదాం, ప్రపంచ కళా శిఖరాలకు!"

దీర్ఘంగా, హృదయపూర్వకంగా హర్షధ్వానాలను చేసి మహాసభ యీ వాక్కులకు తన ఆమోదాన్ని తెలిపింది.









# ప్రజా న్యాయస్థానం

ఎ. బోరిన్

కొన్ని రోజుల క్రితం యువక న్యాయమూర్తి అయిన నామిత్రుడు కాన్‌స్తాంతిన్ పెత్రోవిచ్ సిజోవ్ తాను నాదగ్గర తీసుకొన్న న్యాయ పరిపాలనా విధానానికి సంబంధించిన ఒక గ్రంధాన్ని తిరిగి యిచ్చివేసారు. ఆ గ్రంధంలో 13వ పుటలోని ఒక ప్యారా పెన్సిల్‌తో గుర్తు పెట్టబడివున్నది. ఆ ప్యారాలో ఇలా వున్నది:

"ప్రజలు ఎన్నుకొన్న ఎసెసర్లుగల సోవియట్ న్యాయస్థానాల్లో అవలంబించబడే న్యాయ విధానానికీ నేడు అనేక విదేశాలలో వున్న న్యాయ విధానానికీ తేడా వున్నది. ఇక్కడ వేరువేరు కార్యకలాపాలు సూచించబడలేదు. న్యాయవిచారణ పూర్తి అయిన తర్వాత ప్రజా న్యాయవాది, ప్రజా ఎసెసర్లు ఇద్దరూ కలసి ఒకచోట కూర్చొంటారు. వారు ముగ్గురూ కలిసే ముద్దాయి నేర సమస్యను నిర్ణయించి, దానిని ఆధారంగా చేసుకొని, శిక్షను నిర్ణయిస్తారు. న్యాయమూర్తులు యెన్నుకొనబడే సమయంలోనే ప్రజా ఎసెసర్లుగూడా ఫాక్టరీలు, కార్యాలయాల ఉద్యోగులనుండి ఎన్నుకొనబడుతారు. వాళ్ళు మూడు సంవత్సరాలవరకు ఈ పదవిలో ఉంటారు. సంవత్సరములో పది రోజులు యీ పనిని నిర్వర్తిస్తారు."

"ఆ ప్యారా హఠాత్తుగా నాకొక కేసు విషయాన్ని గుర్తుకు తెచ్చింది. అనుకోకుండానే అలా పెన్సిల్‌తో గుర్తు పెట్టేశాను." అన్నారు కాన్‌స్తాంతిన్ పెత్రోవిచ్, క్షమాపణ చెప్పుకొంటూ. తర్వాత యీ దిగువ కథను ఆయన నాకు చెప్పారు :

ఒక పదిహేను సంవత్సరాల బాలుడు, తన వయస్సు పిల్లవాడ్నే మరొకడ్ని కొట్టినందుకు విచారణకు తీసుకురాబడ్డాడు. ఇలా తేటతెల్లంగా ఉండే కేసులు చాలా అరుదుగా ఉంటాయి. ...గా ఇంకొక విషయం యేమిటంటే,. ముద్దాయిగా తీసుకురాబడిన పిల్లవాడు, తాను ఆ రెండవ పిల్లవాడిని కొట్టడానికి, కావాలనే మెట్ల దగ్గర పొంచివున్న విషయం కాదనలేదు. అయినప్పటికి విచిత్రమైన విషయం యేమిటంటే, అంతకూ పూర్వం ఆ బాలుడు ఎలాంటి చెడుపనులు చేయకపోయినా, అప్పుడు విచారణకు తీసుకొని రాబడినందుకు యేమాత్రమూ భయపడలేదు. అందుకు భిన్నంగా, అలక్ష్యంగాను, నిర్భయంగాను కనబడ్డాడు.

తాను కొట్టిన యురా క్ర్యుజేన్ను, చాలా కాలంబట్టి యెరుగుదుననీ, వాళ్ళిద్దరూ ప్రక్క-ప్రక్క-గావున్న పాఠశాలలో చదువుకొంటున్నామనీ ఆ బాలుడు చెప్పాడు. వాళ్ళ మధ్య యెన్నడూ శత్రుత్వంలేదు. కాని ఆ దురదృష్టపు రోజున, పాఠశాల డైరెక్టరు యురాను, అతడు వుంటున్న భవనంలోనే వుంటున్న మరొక విద్యార్థి సెవా మురతోవ్ ఇంటికి వెళ్ళి అతని తలితండ్రులను కలిసికొని, వాళ్ళ పిల్లవాడు పాఠాలు సరిగ్గా చదవడం లేదనీ, సరిగా ప్రవర్తించడంలేదనీ తెలియజేయమన్నాడు. యురా ఈవిధంగా చెప్పడానికి వెళ్లబోతున్నాడని తెలుసుకొన్న తర్వాత ముద్దాయి, అతని మిత్రులు యురాను ద్రోహిగా నిర్ణయించి, కొట్టడానికి నిశ్చయించుకున్నారు.

ఇదంతా చెప్పడంలో తాను పొరపాటు పడుతున్నానేమోనని ఆలోచించనైనా ఆలోచించలేదు ముద్దాయి. కోర్టువారు తనకు, బాలల లేబర్ కాలనీలో ఒక సంవత్సరం గడపమని శిక్ష విధిస్తారని తనకు తెలుసుననిగూడా అన్నాడు. అతనికి న్యాయ.చట్టం విషయము, కోర్టు విషయము బాగా తెలుసు. తనపట్ల కనికరం చూపవద్దని కోరాడు.

కోర్టు గదిలో చివరవున్న బెంచీలమీద కూర్చున్న డజన్లకొలది యువకులు ఈ విషయాన్ని మెచ్చుకొంటున్నట్లుగా చూడసాగారు. మెచ్చుకోకుండా యెందుకుంటారు ? తన మిత్రునికొరకు త్యాగం చేయడానికి ముద్దాయి సిద్ధంగా ఉన్నాడాయె.

న్యాయమూర్తి సలహా మందిరంలోకి వెళ్ళి చీకాకు పడ్డాడు. తనముందు ఒక తెల్ల కాగితం పెట్టుకొని, ఎసెసర్లకు శిక్షాస్మృతి 143వ ఆర్టికల్‌ను చదివి వినిపించాడు. దురదృష్టవశాత్తు, పిల్లవాడు చెప్పిందంతా నిజమేనని అన్నారు. బాలల లేబర్ కాలనీలో ఒక సంవత్సరం గడపడానికి శిక్ష విధింపవలసి వుంటుంది.

ఎసెసర్లలో ఒక వృద్ధుడు వున్నారు. చేతి గుడ్డ అడ్డంపెట్టుకొని మాటిమాటికి దగ్గుతున్నారాయన.

"అవును, ఆ మాటనిజమే." అన్నాడాయన వెటకారంగా. "ఆ తర్వాత ఆ బాలుడు ఎంతో గౌరవంగా కోర్టుబయటికి తీసుకొని పోబడుతాడు."

"అవును, ఇద్దరు మిలీషియా మనుష్యులు కాపలా కాస్తూ తీసుకుపోతారు," అని అంగీకరించారు న్యాయమూర్తి, విచారంగా.

"ఇంకా అంతకంటే కావలసిందేమున్నది ! గొప్పవీరుడై పోతాడు. ఇతరులుచూచి నేర్చుకుపోతారు గూడాను", అన్నాడు తిరిగి వృద్ధుడు.

"ఐతే మీరు చెప్పేదేమిటి? బహుశ మమ్మల్నే కాపలాకాస్తూ అతనిని బయటికి తీసుకు పొమ్మంటారు కాబోలు ?"

"ఆ పిల్లవాడికి 'నువ్వు వీరుడివి కావురా, అబ్బాయ్, నువ్వంటె భయపడే వాళ్లెవ్వరూ లేరని చెప్పి' నాలుగు తగిలించి కోర్టులోంచి పంపించివెయ్యాలని నేను ప్రదిపాదిస్తున్నాను."

"వాడ్ని అలా వదిలివెయ్యడమేనా ?" అంటూ న్యాయమూర్తి ప్రశ్నించారు. "శాంతిని భగ్నపరిచే ప్రతివాడిని ఇలా వదిలివేస్తుంటే...."

వృద్ధుడికి బాగా కోపం వచ్చింది చేతితో టేబుల్‌మీద గట్టిగా చరిచాడు.

"అబ్బాయ్, నువ్వు యువకుడవు. నేను వృత్తి రీత్యా ఉపాధ్యాయుణ్ని." అంటూ గట్టిగా ప్రారంభించారు." శిక్షాస్మృతిలోని 143 ఆర్టికల్‌ను నాకు వివరించి చెప్పావు. కాని ఇప్పుడు నేను ఇంకొక విషయాన్ని వివరించి చెబుతాను, విను."

చాక్‌లెట్ ఫ్యాక్టరీలో పనిచేస్తుండే ఒక యువతి రెండవ ఎసెసర్‌గా వున్నది. ఆమె భయపడుతూ, "ఎంతయినా ఉపాధ్యాయుడు కదా" అంటూ వృద్ధుడ్ని బలపర్చింది.

న్యాయమూర్తి భుజాలు యెగురవేసారు. "శిక్ష యెలా ఉండాలని చెప్పడానికి మీకు హక్కున్నది. ఆ తర్వాత మనం దానినిగురించి చర్చిద్దాము.

వృద్ధుడు న్యాయమూర్తిని అడిగిన ఒక కాగితము, కలము తీసుకొన్నారు.

తీర్పును ఇవ్వడానికి కోర్టు సిద్ధమయింది. స్పష్టంగా, పెద్దగావున్న అక్షరాలతో వ్రాయబడివున్న కాగితాలను తిరగవేస్తూ న్యాయమూర్తి

తీర్పును చదివారు. ఆ బాలుడు పాఠశాలలోనూ, ఇంటివద్దా కూడా సరియైన శిక్షణను పొందియుండక పోవడం మూలాన ఈ నేరానికి పూర్తిగా అతడే బాధ్యుడని చెప్పడానికి వీల్లేదని ఆయన చదివారు. ఆ బాలుడు స్నేహం యొక్క నిజమైన అర్థాన్ని గ్రహించలేక పోయాడు. అందువల్లనే తన నేరంయొక్క అర్థాన్నిగూడా తెలుసుకొనలేక పోతున్నాడు. కాబట్టి, సమాజంనుండి అతనిని దూరం చేయడము యేమాత్రమూ అవసరంలేదని కోర్టువారు అభిప్రాయపడుతున్నారు. ఈ బాలుడ్ని బహిరంగంగా మందలించి, పాఠశాలలోను, ఇంటి దగ్గరకూడా గట్టి కట్టుబాటులో ఉంచితే సరిపోతుంది. ముద్దాయి చేసిన నేరాన్ని అతని తోటి విద్యార్థులు సరైన విధంగా అర్థం చేసికొనగలుగుతారని కోర్టువారు నమ్ముతున్నారు. కాని, కోర్టువారు, నేరానికి అసలు బాధ్యులు ముద్దాయియొక్క తలిదండ్రులు, ఉపాధ్యాయులేనని భావిస్తూ రెండు నిర్ణయాలను చేశారు.

బోనులోవున్న కుర్రవాడిముఖం జేవురించింది. క్రిందిపెదవి గట్టిగా కొరుక్కున్నాడు.

“అవును,” అంటూ నేనుకూడా అంగీకరించాను, కాన్‌స్టాంతిన్ పెత్రోవిచ్ యీ విషయం చెప్పినప్పుడు. “ప్రజా ఎసెసర్లు మన సత్వశాస్త్రానికనుగుణంగా సరియైన తీర్పులను ఇచ్చిన అనేక కేసుల విషయం నాకు తెలుసు. జీవితంలో తాము పొందిన అనుభవాలద్వారాను కొత్త దృక్పథాల ద్వారాను కోర్టులపనికి ఎంతగానో వారు దోహదం చేస్తున్నారు. అన్నట్టు, ఆ కేసు యెప్పుడు జరిగింది?”

కాన్‌స్టాంతిన్ పెత్రోవిచ్ చిన్నగా నవ్వారు. “పదహారు సంవత్సరాలక్రితం అనుకొంటాను” అన్నారు.

“హాస్యానికదగడంలేదు, నిజంచెప్పు....”

“నిజమే చెబుతున్నాను. ఆ నేరానికి యెన్ని రోజులు లేబర్ కాలనీలో శిక్షపొందవలసి ఉంటుందో చదివిన ఆ ముద్దాయిని నేనే. ప్రాఖోరోవ్ నన్ను విచారించారు. అయన మీకు తెలిసేవుండాలి. నాల్గవ న్యాయస్థానంలో పని చేస్తున్నారు. ఈ మధ్యనే ఆయన, అప్పుడు తనకూ, ఎసెసర్లకూ మధ్య జరిగిన సంభాషణను గురించి చెప్పారు.” కాన్‌స్టాంతిన్ పెత్రోవిచ్ ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి ఇలా అన్నారు: “కోర్టులతో నాకు సంబంధం యేర్పడడం, అదే మొదటి తడవ.”

---

# భారత ప్రభుత్వపు విలువైన కానుక

సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తుకు చెందిన ప్రాచ్యవిద్యాధ్యయన సంస్థలో యిటీవల నొక సంస్మరణీయమైన సంఘటన జరిగింది. సోవియట్ దేశంలోని భారత రిపబ్లిక్కు ఛార్జ్ డి అఫైర్స్ ఆవ్ ఇంటెరిమ్ శ్రీ పి. రత్నం తన ప్రభుత్వం తరపున, భారతీయ గ్రంథకర్తలు రచించిన సుమారు 300 గ్రంథాలనూ, భారతీయ సంస్కృతికి, కళలకు, చరిత్రకూ, సారస్వతానికీ సంబంధించిన రచనలనూ పారితోషికంగా యీ సంస్థకు అందజేశారు.

శ్రీ రత్నం యీ సమావేశంలో యిలా ఉపన్యసించారు:

“ప్రియమిత్రులారా, భారతీయ భాషలపట్ల భారతీయ కళారచనలపట్ల సోవియట్ ప్రజలు, ముఖ్యంగా ప్రాచ్య విద్యాధ్యయన సంస్థవారూ గొప్ప ఆసక్తిని చూపుతూవుండడం మేము గమనిస్తున్నాము. మీరు యిప్పటికే రష్యన్ భాషలోనికి చాలా ముఖ్య రచనలను —“రామాయణం”, “మహాభారతం”లో ఒక భాగం, ప్రధానమంత్రి నెహ్రూ రచించిన “భారత దర్శనం”, ఆయన ఆత్మకథ మొదలైనవాటిని అనువదించారు. యిప్పుడు మీరు యితర గ్రంథాలను అనువదిస్తున్నారు. ఇందుకు మేమెంతో ఆనందిస్తున్నాము, భారతీయ సారస్వతంలో యిటువంటి గొప్ప ఆసక్తిని చూపుతున్నవారికి మేము కృతజ్ఞులం.”



శ్రీ పి. రత్నం యీ సంస్థకు బహుమానముగా ఇచ్చిన గ్రంథాలలో బెంగాలీలో రవీంద్రనాథ టాగూరు రచించినవీ, ఆయనకు సంబంధించినవీ సుమారు 150 గ్రంథాలూ, వల్లథోల్ కవి మలయాళంలో రచించిన 18 గ్రంథాలూ, హిందీలో ప్రేమచంద్ రచించిన 35 గ్రంథాలూ, సంస్కృత మహాకావ్యం “మహాభారతం” పద్దెనిమిది పర్వాలూ ఉన్నాయి.

మహాత్మాగాంధీ రచనల ఎనిమిది సంపుటాలూ, భారత విద్యాశాఖమంత్రి మౌలానా అజాద్ గ్రంథాలూ, గుజరాతీ, తమిళం, మరాఠీ, తెలుగు, కన్నడ భాషా గ్రంథాలూ కూడా బి. గపురోవ్‌కు బహూకరింపబడ్డాయి.

ఈ గ్రంథాలు సంస్థకు, భారతీయసారస్వత పాఠకులకు ఉపయోగకరంగా ఉండగలవని శ్రీ రత్నం ఆశించారు.

# స్నేహ సంగీతం


అజర్‌బైజాన్ ప్రజలకు బహూకరించబడిన భారతీయ జంత్ర వాద్యాలు

మాస్కోలోని అజర్‌బైజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ శాశ్వత ప్రతినిధి భవనం జనంతో కిటకిటలాడిపోయింది. వాతావరణం అంతా ఆనందదాయకంగాఉన్నది. లాంఛనంగా జరిగిన ఒక సమావేశంలో భారతీయ ప్రాచీన జంత్రవాద్యాలు కొన్ని భారత ప్రభుత్వం తరపున అజర్‌బైజాన్ ప్రజలకు బహూకరింపబడ్డాయి. అదే అందరి ఆనందానికీ కారణము.

అక్కడికి వచ్చిన ప్రజలు అపురూపమైన ఆ వస్తువులను జాగ్రత్తగా తమ చేతుల్లోకి తీసుకొని చాలాసేపు దీక్షగా పరిశీలించారు. తేలికగా, అసలు బరువే లేనట్లుగా ఉండి, యెంతో అందంగా దంతపు జిలుగుపని పొదగబడిన అనేక తీగల సితారను వారు చూచారు. ఉత్తర భారతంనుండి అతిథిగా వచ్చిన సరోద్‌కూడా దాని ప్రక్కనే ఉన్నది. ఇవిగాక ఆ జంత్రవాద్య సంచయంలో, శాస్త్రీయ సంగీతంలో పక్క వాద్యంగా ఉపయోగింపబడే తంబురా, వివాహ సందర్భాలలో వాయింపబడే సన్నాయి, దక్షిణ భారత దేశపు ప్రాచీన వాద్యం, వీణ ఉన్నాయి. ఏ ఆటలోనైనా సరే, లయ విషయంలో ఆధిపత్యం వహించే అసమానమైన తబలా, మణిపురీ నగారా, మృదంగం కూడా యీ సంకలనంలో ఉన్నాయి. అక్కడికి వచ్చిన వారంతరూ యీ వాద్యాలను యెంతో ఆసక్తితో పరిశీలించారు. అక్కడ కనబడిన 24 పింగాణీ కప్పులు ముఖ్యంగా వారిని ఆకర్షించాయి, ఈ కప్పులలో నీరు నింపి, తేలికైన కర్రతో వాటిపైన కొట్టినట్లయితే ఒక్కొక్క పింగాణీ కప్పు ఒకొక్క మధురమయిన స్వరాన్ని ఈనుతుంది....

ఈ జంత్రవాద్యాల కళాత్మక మౌలికత్వాన్నీ, అవి తయారు చేయడంలో కనబర్చబడిన అమోఘమైన చాతుర్యాన్నీ అక్కడ చేరిన వారు గొప్పగా పొగిడారు.

"నమ్రతతో చేయబడుతున్న యీ బహుమతి—భారత దేశం, అజర్‌బైజాన్ ప్రజల మైత్రికి ఒక చిహ్నంగా ఉండుగాక," అన్నారు, భారత దేశం తరపున అజర్‌బైజాన్ ప్రజలకు యీ జంత్రవాద్యాలను అందజేసిన, పి. రత్నం.

....తమకు అపరిచితమైన ఆ జంత్రవాద్యాలను చూడడానికీ, వాటిని తాకడానికీ ప్రతివారు కుతూహలపడ్డారు. ప్రజలు వాటిదగ్గరకు వెళ్ళి వాటి తీగెలను మీటగా, అవి స్వచ్ఛమైన మధురస్వనాలనీనాయి. మైత్రిని ప్రతిధ్వనింపజేసాయి, ఆ తీగెలు.

మాస్కోలోని అజర్‌బైజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ శాశ్వత ప్రతినిధికి శ్రీ పి. రత్నం భారతీయ జంత్ర వాద్యాలను బహూకరిస్తూ



# ✻ నేపాల్-సోవియట్ మైత్రి ✻

నేపాల్-రష్యా మిత్రమండలి 1957 మార్చి 11వ తేదీన, నేపాలులో సోవియట్ దేశపు రాయబారి శ్రీ యం. ఎ. మెన్షికోవ్‌కు స్వాగతం యిచ్చింది. ఆయన నేపాలు మహారాజుకు తన నియామక పత్రాలను సమర్పించడానికి నేపాలుకు వెళ్లారు. నేపాలు ప్రధానమంత్రి శ్రీ ఆచార్య, మంత్రులు, ఉన్నతాధికారులు, దౌత్య వర్గాల సభ్యులూ, నేపాలు ప్రజాజీవితంలోని వివిధ విభాగాల ప్రతినిధులతో బాటుగా 500 మంది స్వాగతానికి హాజరయ్యారు.

నేపాలు-రష్యా మిత్రమండలి శ్రీ యం. ఎ. మెన్షికోవ్‌కు స్వాగతపత్రాన్ని సమర్పించింది. "ఈ అధునాతన వైజ్ఞానిక యుగములో స్నేహాభివృద్ధికి దూరం ఆటంకంకాద"ని చెపుతూ సోవియట్, నేపాల్ దేశాలకు మధ్య దౌత్యసంబంధాల స్థాపనను స్వాగత పత్రం ప్రశంసించింది. "కారుణికమైన, అభ్యుదయకరమైన, బలోపేతమైన, శాంతికాముకమైన, సంస్కృతీ వంతమైన మీదేశంవంటి దానితో సంబంధ స్థాపన మా దేశానికి లాభదాయకంగా వుండడం మాత్రమే కాకుండా, ప్రపంచశాంతికి నిస్సందేహంగా తోడ్పడగలదు కూడా" నని అది తెలియజేసింది.

స్వాగతపత్రానికి జబాబు చెపుతూ శ్రీ యం. ఏ. మెన్షికోవ్ యిలా ప్రసంగించారు :

"శ్రీ ప్రధానమంత్రీ,

మిత్రులారా,

"మీరు మాకిచ్చిన సాదరపూర్వక స్వాగతానికీ, స్నేహపూర్వక అభినందన వాక్కులకూ సోవియట్-నేపాల్ మిత్రమండలి సభ్యులందరికీ మా హార్దికమైన కృతజ్ఞతను మొదట తెలుపడానికి అనుమతించండి.

"నేపాలీస్ ప్రజలు సాధించిన విజయాలనూ, తమ ఆర్థిక, సంస్కృతీ అభివృద్ధి మార్గాన వారు చేయదలుచుకున్నదానినీ, సోవియట్ ప్రజలు మనఃపూర్వకమైన ఆసక్తితో, సానుభూతితో వీక్షిస్తున్నారు. మీదేశం యిప్పుడిప్పుడే ప్రథమ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించింది; సోవియట్, నేపాల్ దేశాలమధ్య స్నేహపూర్వకమైన సహకారం నేపాల్, సోవియట్ ప్రజలు ఉభయుల శ్రేయస్సుకు అనుగుణంగా వుంటుందనడానికి నా కెంతమాత్రమూ సందేహంలేదు. సోవియట్, నేపాలు దేశాల మధ్య దౌత్య సంబంధాలు యిప్పుడు స్థాపింపబడడంవల్ల, మన దేశాల మధ్య ఆర్థిక సహకారానికీ, సాంస్కృతిక సంబంధాలకూ నూతన అవకాశాలు కలుగుతాయి.

"అత్యున్నతమైన హిమాలయ పర్వతాలు సోవియట్ దేశాన్ని భారత, నేపాలు దేశాలనుండి వేరుచేస్తున్నాయి; కాని వివిధ ప్రజల మధ్య మనఃపూర్వక మైత్రిని నిరోధించగల అడ్డంకులేవీలేవు. మీ సంఘం చేస్తోన్న కృషి మన ప్రజలమధ్య స్నేహసంబంధాలు, అధికతర పరస్పర అవగాహన పెంపొందడానికి గొప్ప ప్రాముఖ్యంగల విషయమని, యీ సందర్భంలో నేను చెప్పదలుచుకున్నాను. మనం ఒకరినొకరం బాగా తెలుసుకున్నకొద్దీ, మనం యింకా సన్నిహితంగా సహకరించుకుంటాం, మనమైత్రి యింకా దృఢపడుతుంది, శాంతి శక్తులు యింకా పరిపుష్టమవుతాయి.

"మిత్రులారా, సోవియట్, నేపాలు దేశాల మధ్య స్నేహ సంబంధాలు అధికతరంగా, యింకా అధికతరంగా పెంపొందగలవన్న విశ్వాసాన్ని వ్యక్తపరచుతున్నాను. సుదూర భవిష్యత్తులో నేపాలు సంస్కృతీ, కళలకు ప్రతినిధులైన వారు మాదేశానికి రాగలరని ఆశిస్తున్నాను; యింకోవేపున సోవియట్ సంస్కృతీ, కళల ప్రతినిధులు మీ సుందర దేశానికి సంతోషపూర్వకంగా రాగలరు.

"సోవియట్, నేపాలు ప్రజల మధ్య మైత్రి అభివృద్ధి, దృఢపర్చడం అన్న ఉదాత్తమైన ముఖ్యకృషిలో సోవియట్-నేపాల్ మిత్రతామండలికి విజయాలను కాంక్షిస్తున్నాను.

ఇక యీ మండలి గ్రంథాలయానికి మా అల్ప బహుమానాన్ని —కొద్దిపాటి సోవియట్ గ్రంథాలనూ, పత్రికలనూ అందజేయ దలచుకున్నాను. యివి సోవియట్ ప్రజల జీవితం గురించి మీరు కాస్త తెలుసుకోవడానికి తోడుపడగలవని ఆశిస్తున్నాను."

నేపాల్, రష్యా మిత్రమండలి వారు సమర్పించిన స్వాగత పత్రాన్ని స్వీకరిస్తోన్న శ్రీ ఎం. ఎ. మెన్షికోవ్



# బాల నటుడు





"ధైర్యవంతమైన సీమ కుందేలు" చిత్ర నిర్మాణంలో పనిచేయడం మనకు ఎంత ఆహ్లాదకరమైందో నీకు జ్ఞాపకం వుందా....?"

సోవియట్ సినీమా ప్రేక్షకులు తెరపైని తరచుగా ఒక కుర్రవాణ్ని చూస్తారు. ఈ కుర్రవాడు ఎప్పుడూ ప్రజల సానుభూతిని చూరగొంటుంటాడు. ఈ ఆరేళ్ళ కుర్రవానిది గుండ్రని ముఖం, విశాల నేత్రాలూ; కెమెరాముందు అంత సహజంగా, తన పాత్రలో గొప్పగా లీనమై నటిస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది. వాడు దుఃఖిస్తున్నప్పుడు, ఏడ్చుతున్నప్పుడూ కృత్రిమత్వం ఎక్కడా కనిపించదు; మనస్ఫూర్తిగా వాడు నవ్వుతూవుంటే మనంకూడా వానితోబాటు నవ్వకుండా వుండడం అసాధ్యం. ఈ బాలనటుని పేరు విత్యా కోవల్. వి. లాసిన్ నవల "నూతన తీరాలకు"లో యీ బాలుడు మొదటిసారిగా నటించాడు. పిల్లల చిత్రం "ధైర్యవంతమైన సీమ కుందేలు"లో ప్రధానపాత్రనూ, "వాసెక్ త్రుబచెవ్, అతని మిత్రులు"లోనూ ఆ తదుపరి నటించాడు "రుమ్యన్త్సేవ్ కేసు"లో పుట్టుమచ్చ కుర్రవాడుకూడా యీ బాలుడే.

మా పాఠకులు యీ ఫిల్ములను చూసివుండవచ్చును, ప్రతిభావంతుడైన యీ బాలనటుడు ఎలా వుంటాడో, వాడు ఫిల్ములో ఎలా చేరాడో తెలుసుకొనగోరడంకూడా సాధ్యమే.

"మోస్ ఫిల్మ్" స్టుడియోలలో "నూతన తీరాలకు" అన్న చిత్ర నిర్మాణం ప్రారంభించబడినప్పుడు ఆల్బర్ట్ అన్న కుర్రవాని పాత్రకు ఎవ్వరూ దొరకలేదు. సహాయ దర్శకురాలు నోరా ముల్లర్ యిటువంటి కుర్రవాడికోసం ప్రతి చోటా అన్వేషించారు. మాస్కో పాఠశాలల లోనూ, వీధుల్లోనూ, పెరళ్ళలోనూ. చివరికి ఒకరోజున 240 వ నెంబరు ప్రాథమిక పాఠశాల ఆవరణలో ఫుట్‌బాల్ పోటీని చూశారు. క్రీడాభిమానుల అల్లరిగుంపులో ఆమెకు నీలనేత్రాల కుర్రవాడొకడు కనిపించాడు. వాడు ఆమె దృష్టిని పూర్తిగా ఆకర్షించాడు.

"నేను నిజంగా ఎంతో విచారపడుతున్నాను."





ఆటగాళ్ళను చూడవలసిన పనిలేదు. ఆటలో ఏమేమి జరుగుతూవుందో తెలిసిపోతుంది. ఆ చిన్న కుర్రవాడి హావభావాలను చూస్తే "మాకు కావలసిన వాడు వీడే. ఇంతకంటె మంచివాడు నాకెక్కడా దొరకడు" అనుకుని ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది. రెండురోజుల తరవాత ఆమె విత్యా కోవల్‌ను స్టుడియోలకు తీసుకవచ్చి, నిర్మాత ఇవ్యా ఫ్రెక్‌కు చూపెట్టింది.

"కాని బండముక్కుతో యీ కుర్రాడు ఆల్బర్ట్ వేషానికేం బాగుంటాడు?" నిర్మాతకు ఆశాభంగ మైనట్టుగా వుంది.

కాని పలుఘట్టాలలో ఆ కుర్రవాణ్ణి పరీక్షించాక, నిర్మాతకు వాడు చాలా నచ్చకున్నా, కాని బండముక్కు నాయన 'క్షమించాడు.' ఈ విధంగా విత్యా సినిమా జీవితం మొదలైంది.



ఈ బాలనటుడు వాస్తవ జీవితంలో ఎలావుంటాడో తెలుసుకుందామని ప్రేక్షకులు ఆతృతపడతారు. బహుశా తెరమీద వున్నంత చక్కగా వుండడేమో? కాని విత్యా ఎవ్వరికీ ఆశాభంగం కలిగించ లేదు ఈ వ్యాసంలోని చిత్రాలనుబట్టి అది తెలుస్తుంది. విశ్రాంతి సమయంలో క్లాసుగదిలో ఆ కుర్రవాడు "ధైర్యవంతమైన సీమ కుందేలు"లోని సాహస కార్యాలను గురించి తన తోటి కుర్రవాళ్ళకు చెపుతూవుండడం, ఒక చిత్రంలో కనిపిస్తుంది. దానిలో వాళ్ళు వాడితోకలిసి నటించారు మా విలేఖరి బడి మెట్లమీద జరిగిన ఒక ఘటనను తీసిన ఛాయాచిత్రం యింకోటి. ఆ చిన్న బాలికకు ఏదో కీడు జరిగినట్టుగా విత్యాముఖం చెప్పక చెప్తుతుంది. బహుశా ఆ పిల్లకు తక్కువ మార్కు వచ్చిందేమో. తరవాత విత్యా యింట్లో వున్న దృశ్యం. వాడప్పుడే బడినుండి తిరిగివచ్చాడు, అమ్మ వర్తన చేస్తుంటే, తాను కూడా కాస్త గృహకృత్యాలు చేస్తున్నాడు. నీళ్ళు మరుగుతోన్న టీ పాత్రలో వాడు కోడిగుడ్డు వేశాడు, కాని అది పగిలిపోవడం చూసి విస్తుపోయాడు. ఇటువంటి పనులుచేస్తే అమ్మ కోప్పడక తప్పదు. కోడిగుడ్డును సూపులో ముంచి పెట్టడానికి విత్యా ప్రయత్నిస్తాడు, కాని వేన్నీళ్ళతో ఆట ప్రమాదకరం; టీపాత్ర చాలా వేడిగా వుందని వాడు తెలుసుకుంటాడు।

ఈ బాలనటుడు జీవితంలో కూడా చురుకైనవాడు. రకరకాల విషయాలగురించి ఎప్పుడూ ఆలోచిస్తూవుండే చురుకైన అల్లరి పిల్లవాడే. కాని విత్యా అల్లరి పిల్లవాడు మాత్రమేకాదు, అప్పుడప్పుడు శ్రద్ధాసక్తులు కూడా చూపుతాడు. తరవాతవున్న చిత్రం, వాడు శ్రద్ధగా సంగీతపాఠం నేర్చుకుంటూవున్న దృశ్యం.



విత్యా కోవల్ వయసు ఎనిమిదేళ్లు, 240వ నెంబరు ప్రాథమిక పాఠశాల మొదటి తరగతిలో వున్నాడు. వాడు మళ్ళీ ఫిల్ముల్లో చేరి చాలా పనిలోవున్నా, బడిలో వాడి బడిపాఠ్యాలన్నీ ఉత్తమమైనవి.

---

"గుడ్డును ఉడికించడంలోకూడా వినోదం లేదూ!" (పైన)

"అబ్బో, గిన్నె సలసలా మరుగుతున్నది!" (మధ్య)

"నేను సంగీతంలోకూడా బాగా పైకిరావాలి, ఇది సామాన్యమైన పనికాదు (దిగువ)

## అంతర్జాతీయ సమీక్ష

# శాంతి, అభ్యుదయాల పోరాటానికి ★ ఆసియా, ఆఫ్రికా

1955 లో 29 ఆసియా, ఆఫ్రికా దేశాల మహాసభ, వలస పెత్తందారీ దేశాలు పాల్గొనకుండానే, విముక్త ఇండోనీషియా లోని బాండుంగ్‌లో జరుగుతుందని, అటువంటి మహాసభ వలస పెత్తందారీ విధానాన్ని ఖండించి, ప్రపంచ సమస్యలపైనా, ఆ మహాసభలో పాల్గొంటున్న దేశాలు యేవిధంగా స్వతంత్రమైన విధానాన్ని అవలంభించాలన్న విషయంపైనా నిర్ణయాభిప్రాయాలను ప్రకటిస్తుందనీ రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కావడానికి పూర్వం యెవరైనా ముందుగా చెప్పి ఉన్నట్లయితే, అలాంటివారు ఊహాగానాలు చేస్తున్నట్లుగా పరిగణింపబడి వుండేది.

కాని, నిజానికి, వలస పెత్తందారీ విధానాన్ని ఇంకా కొనసాగించడమూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, శాంతి, అభ్యుదయాలపై పు జరుగుతున్న అభేద్య ప్రజా పురోగమనాన్ని అరికట్టడమూ సాధ్యమనీ నమ్మడమే ఊహాగానమవుతుంది.

ఊహాగానంకంటే వాస్తవికతే అత్యంత మైన వైవిధ్యాన్ని కలిగి వుంటుందన్న మాట నిజం.

ప్రస్తుతం, ఆసియా దాదాపు అంతా పాత వలస పెత్తందారీ విధానంనుండి విముక్తి పొందింది. కొద్దిగా ముందుగానో లేక వెనుకగానో—బహుశ ముందుగానే కావచ్చు—ఇంకా వలస పెత్తందారీ ఆధీనంలో వుంటున్న ఆఫ్రికా ప్రజలుకూడా విముక్తి పొందుతారు.

కోటానుకోట్ల ప్రజలు ఇప్పుడు పోరాటాన్ని కొనసాగిస్తున్నారు గానట్టి, వలస పెత్తందారీ విధానంలో ప్రారంభమయిన విచ్ఛిత్తిని ఆపడం సాధ్యం కాదు.

ప్రజానీకం ఇప్పటికంటే తక్కువసంఖ్యలో, లేదా ప్రజానీకంలోని సంపన్నవర్గాలైన ఉన్నత వర్గాలు మాత్రమే సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో పాల్గొంటున్న మొదటి దశలో వలస పెత్తందార్లు. వారిని అణిచివేస్తూ, లేక వారికి కొన్ని సౌకర్యాలనిచ్చి వారితో సమాధాన పడుతూ, లేక ప్రజానీకంలో ఒక భాగాన్ని మరొక భాగంపైకి రెచ్చగొడుతూ, తద్వారా తమ పరిపాలనను కొనసాగించుకొనగలుగుతుండేవారు. కాని యీనాటి జాతి పోరాటంలో పాల్గొంటున్న దశలో అట్టి పద్ధతులేమీ కొనసాగవు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆసియాలో జాతీయ విముక్తి ఉద్యమం నిజమైన జాతీయ ఉద్యమంగా రూపొందినమాట నిజం. అది విజయం పొందడానికి ప్రధానకారణం కూడా ఇదే.

సోవియట్ దేశ ప్రజలు, అణిచివేయబడిన ప్రజల జాతీయ విముక్తి పోరాటంపట్ల యెల్లప్పుడూ సానుభూతిని చూపుతూ, వారికి సాధ్యమైనంత సహాయాన్ని చేస్తూ వచ్చారు. జర్మన్ ఫాసిజమ్ జపాను సైనికవాదాల పరాజయం—ఈ విషయంలో సోవియట్ దేశం ప్రధానమైన పాత్రను వహించింది—ఆసియాలోని జాతీయ విముక్తి ఉద్యమానికి విజయాన్ని చేకూర్చుటకు ఒక నిశ్చితాంశ మయింది.

పాతపద్ధతి వలస పెత్తందారీ విధానము, చారిత్రక రంగంమీదినుంచి తొలిగిపోతున్నది. కాని కొత్తరూపంలో వున్న వలస పెత్తందారీ విధానాన్ని విస్మరించడం ప్రమాదకరమైన పొరపాటు అవుతుంది.

'సియాటో', బాగ్దాద్ లకపు సైనిక కూటములు కమ్యూనిస్టు వ్యతిరేకతను ఒక ముసుగుగా వినియోగించుకుంటాయి. కాని వలస విధానాన్ని స్వేచ్ఛగా నిర్ణయించుకోడానికి ఉద్దేశించాయని సూచిస్తుంది.

"బాండుంగ్ సంకల్పం" అంటే, వలస పెత్తందారీ విధాన వ్యతిరేకత, సహకారం, సర్వసత్తాధికారం, స్వాతంత్ర్యం, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యం కల్పించుకొనకపోవడం, శాంతియుత సహజీవనం, పురోభివృద్ధికి తమ స్వంత మార్గాన్ని అన్వేషించుకొనడం మొదలైనవాటికి సంబంధించిన సరళి అన్నమాట.

ఆసియా దేశాలలో యుద్ధానంతరం వచ్చిన మార్పులు, జాతీయ విముక్తి ఉద్యమాలు రూపొందిన విధానాల్లోను, స్వాతంత్ర్యాన్ని సాధించుకొనే మార్గాలు, పద్ధతుల్లోను గొప్ప వైవిధ్యాన్ని ప్రదర్శించాయి. ఈ దేశాల కన్నిటికి కొన్ని సమానమైన సమస్యలు ఉన్నప్పటికి, వాటి పురోభివృద్ధికూడా పలు స్వరూ

పెత్తందారీ వ్యతిరేక విధానాన్ని కమ్యూనిజంగా కట్టడం చాలా సులభమైన విషయంగాబట్టి అ కూటములు జాతీయ విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా ఉపయోగించబడుతాయి. ఇందుకు ఉదాహరణలు చూపటానికి యెంతో దూరం పోనవసరం లేదు.

ఈ సైనిక ఒడంబడికలలో వున్న మరొ ప్రమాదం యేమిటంటే, అవి, వాటిలో పాల్గొంటున్న బలహీన దేశాలను, ఆ ఒడంబడికలను ప్రారంభించిన శక్తివంతమైన దేశాలపైన రాజకీయంగాను, సైనికంగానే గాక ఆర్థికంగాకూడా ఆధారపడి వుండేటట్లు చేస్తాయి.

అంతేగాక, ఈ సైనిక ఒడంబడికలను ప్రారంభించినవారు సహాయం చేయడానికి ముందుకు వచ్చే పలు ఆర్థిక పథకాలు ప్రచ్ఛన్న యుద్ధ ధోరణిని కలిగి వుంటాయి.

విముక్తులైన ఆసియా, ఆఫ్రికా ప్రజలు ఈ కొత్త వలస పెత్తందారీ రూపాల వెనుక దాగి యున్న ప్రమాదాలను ఉపేక్షించడంలేదు. వలస పెత్తందారీ రాజ్యాలు పాల్గొనకుండానే బాండుంగ్ మహాసభజరగడం, ఆ మహాసభలో పాల్గొన్న దేశాలు ప్రపంచ వ్యవహారాలపైనా, తమకు సంబంధించిన సమస్యలపైన తమ

పాల్లో నడుస్తున్నది ఉదాహరణకు, స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న దేశాలు, అ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనవలసి యున్నది. కొన్ని పరిస్థితులలో, యీ స్వాతంత్ర్య పరిరక్షణ, స్వాతంత్ర్య సాధనకంటే గూడా కష్టమైన పని అవుతుంది.

ఈ సమస్యపైన బాండుంగ్‌లో ఏకాభిప్రాయం కుదరడం, యీ ఆదర్శసాధనను నిస్సందేహంగా సులభతరం చేస్తుంది. ఈజిప్టుపై దురాక్రమణను ఆసియా, ఆఫ్రికా దేశాలు ఏకగ్రీవంగా ఖండించడం—ఆ దురాక్రమణ తిరిగి ప్రారంభమయ్యే ప్రమాదము యింకా తొలగక పోయిన స్థితి—దానిని అరికట్టడానికిమాత్రం బాగా దోహదమిచ్చింది.

పారిశ్రామికరణ విషయం గూడా చిన్న సమస్యకాదు. ప్రపంచం ఒక సాంకేతిక విప్లవానికి లోనవుతున్నదిగాబట్టి అది నిజంగానే కష్టతరము, క్లిష్టము అయిన సమస్య అవుతున్నది. ఉత్పత్తిలో పెద్దయెత్తున స్వయం చలనీకరణ యంత్రాలు ఉపయోగింపబడుతున్నాయి. ఉత్పత్తి, జీవితాలకు సంబంధించిన అన్ని రంగాలలోకి అణుశక్తి ప్రవేశిస్తున్నది.

వెనుకబడివున్న దేశాన్ని ఆధునిక పారి

# ప్రజల సంఘటన ★

## ఎస్. రోస్తొవ్‌స్కీ

శ్రామిక దేశంగా రూపొందించడం యెంత కష్టతరమైన పనో, అట్టి అనుభవాన్ని పొందిన సోవియట్ ప్రజలకు తెలుసు.

పూర్వం వెనుకబాటు తనంలో ఉండిన రష్యాను ఒక శక్తివంతమైన ఆధునిక రాజ్యముగా సోవియట్ ప్రజలు రూపొందించిన విధానాన్ని ఒక అద్భుతంగా కొందరు ప్రజలు పరిగణిస్తారు.

కాని ఆ అద్భుతంయొక్క రహస్యం పెద్ద విషయమేమీకాదు: పారిశ్రామీకరణ ప్రజానీకాని కంతటికీ సంబంధించిన విషయం. ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రతియొక్క సోవియట్ పౌరుడు అనన్య త్యాగాన్ని, చొరవను ప్రదర్శించాడు.

ఈ సమస్యను పరిష్కరించడానికి ఇంతకు మించి వేరేమార్గం లేకపోయింది. రష్యాకు కీడుకలగాలని కోరేవారు అన్ని విధాలైన ప్రతిబంధకాలను కల్పించారు. అందువల్ల మా ప్రజలు ఒకచేతిలో నాగలిని, మరొకచేతిలో తుపాకీ పట్టుకొని నూతన జీవితాన్ని నిర్మించుకొనవలసివచ్చింది. ఈ విషయంలో విధి ఆసియా ప్రజలపైన కరుణాకటాక్షాన్ని ప్రదర్శించింది. ఆదేశాలు సోవియట్ దేశ మైత్రి పూరితమైన తోడ్పాటుపైన యెల్లప్పుడూ ఆధారపడి ఉండవచ్చు.

చివరివిషయం యేమిటంటే, ఆసియా, ఆఫ్రికా దేశాలన్నీ తమ భౌతిక, సాంస్కృతిక ప్రమాణాలను పెంపొందించుకొనవలసిన సమస్యనూ, ఆ ప్రాంతాల్లో మిగిలిపోయిన వలస పెత్తంవారీ విధాన అవశేషాలను తొలగించి వేయవలసిన సమస్యనూ యెదుర్కొంటున్నాయి.

ఈ సమస్యలు చాలా క్లిష్టము, కష్టతరము అత్యవసరము అయినవి. వాటిని ఉపేక్షించి వదిలివేయడానికి వీల్లేదు. తక్షణమే పరిష్కరించబడాలి.

బాండుంగ్ మహాసభలో పాల్గొన్న దేశాలు ఈ సమస్యల ప్రాధాన్యతను గుర్తించాయని, ఆ మహాసభ రుజువుచేస్తున్నది. బాహ్యులైన రాజకీయవేత్తలు తమతమ దేశాలను ముందుకు తీసుకొనిపోవడంలో పొందిన అనుభవాలను పరస్పరం తెలియజేసుకోడానికి ఆ మహాసభ ఒక వేదికగా ఉపయోగపడింది. తమ అనుభవాలను అలా ఒకరికొకరు తెలియజేసుకోవడంయొక్క విలువ వేరుగా చెప్ప నవసరం లేదు.

శాంతిని పరిపోషించడం, దేశాల మధ్య సంబంధాల విషయంలో "పంచశీల" సూత్రాల ననుసరించడం, పరస్పర సహాయం అభివృద్ధికి అనివార్యమైన పరిస్థితులని గుర్తింపబడింది.

సోవియట్ దేశము, తదితర సోషలిస్టు దేశాలూ, అన్ని దేశాల ప్రజలతో శాంతి స్నేహాలకొరకు, వారితో అన్నివిధాలైన సమాన పరస్పర లాభదాయక ఆర్థిక సహకారం కొరకు నిలబడుతున్నాయి.

ఈ మధ్యనే తనపనిని ముగించిన ఆసియా దూరప్రాచ్యదేశాల మిత్రరాజ్యసమితి ఆర్థిక కమీషన్ 13వ సమావేశంలో, సోవియట్ దేశం 1956లో ఆసియా, దూరప్రాచ్య దేశాలతో 8,000 మిలియన్ రూబుళ్ళ (2,000 మిలియన్ డాలర్లు) వ్యాపారాన్ని జరిపిందని తెలుపబడింది. అనగా 1955 లో జరిగిన వ్యాపారంకంటే 15 శాతం యెక్కువన్నమాట.

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించడం విషయంలో తాను పొందిన అనుభవాలను ఆసియా దేశాలకు తెలియజేయడానికి సోవియట్ దేశం సంసిద్ధంగా ఉన్నదనీ దుబ్నోలో నిర్మింపబడివున్న అణుశక్తి పరిశోధన యొక్క సృష్టి విద్యాసంస్థలో చేరదలచుకొనేవారందరికీ అవకాశం యివ్వబడుతుందనీ సోవియట్ ప్రతినిధులు ఆ సమావేశంలో వెల్లడించారు.

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించే రంగంలో పరిశోధనలు జరుపడానికి ఆసియా దేశాలకు సహాయపడేందుకు, పరస్పర సహాయం ప్రాతిపదికపైన, సహాయము చేయడానికి గూడా సోవియట్ దేశము అంగీకరిస్తున్నది. ఉదాహరణకు, ఈ సహాయం వైద్యావసరాలకొరకు, పరిశోధనా కార్యకలాపాలకొరకు ఐసోటోపుల సరఫరా విజ్ఞాన శాస్త్రవిషయిక, సాంకేతిక సమాచారాన్ని అందజేయడం, విద్యార్థులకు శిక్షణ నివ్వడం మొదలైన రూపాలలో జరుగవచ్చు.

ఆర్థికంగా బాగా అభివృద్ధిపొందని దేశాలకు ఆర్థిక సహాయం చేయడానికి ప్రత్యేకంగా ఒక మిత్రరాజ్య సమితి నిధిని ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనను సోవియట్ ప్రతినిధివర్గం బలపర్చింది. ఆయుధాలు, సైనిక ఖర్చుల తగ్గింపు విషయంలో సోవియట్ దేశం చేసిన ప్రతిపాదనలు అంగీకరింపబడివున్నట్లయితే, యీనిధికి యెంత యెక్కువ మొత్తం సేకరింపబడి ఉండేదో అర్థం చేసుకొనవచ్చును.

ఆసియాదేశాలను పారిశ్రామికం చేయడములో ఉత్పన్నమయ్యే సమస్యలను గురించి ఆలోచించడానికి మిత్రరాజ్యసమితి పరిధిలో ఒక ప్రత్యేక సంఘం యేర్పాటు చేయబడాలన్న ప్రతిపాదనను, మిత్రరాజ్యసమితి ధన సహాయంతో, దక్షిణ ఆసియా దేశాలలో ఒక దానిలో అఖిల ఆసియా పోలీ టెక్నికల్ విద్యా సంస్థను స్థాపించాలన్న ప్రతిపాదనను గూడా సోవియట్ దేశం బలపరుస్తున్నది.

ప్రపంచ ఆర్థిక మహాసభను జరుపడం విషయంలో అభిప్రాయాలను పరస్పరం తెలుసుకోవాలని ఈ సమావేశంలో సోవియట్ ప్రతినిధివర్గం సూచించింది.

ఆర్థిక, వైజ్ఞానిక సహకార రూపాల్లో ఇవి కొన్ని. ఉభయపక్షాలు సుహృద్భావాన్ని ప్రదర్శించి నట్లయితే ఇట్టి సహకారం ఇంకా ఎక్కువగా విస్తృతం గావింపబడ వచ్చును.

ఆసియా, ఆఫ్రికా దేశాలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం జాతీయ స్వరూపాన్ని కలిగి వున్నది. కార్మికవర్గం, రైతాంగం మొదలుకొని జాతీయ బూర్జువావర్గం వరకు అన్నిరకాల సామాజికవర్గాలు ఈ పోరాటాన్ని కొనసాగిస్తున్నాయి. ఈ సాధారణ సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో శ్రామిక ప్రజానీకం ప్రముఖ పాత్రను వహిస్తున్నది. వారు రాజకీయంగా ఇదివరకటికంటే యెక్కువ చురుకుదనంతోను, అనుభవంతోను పని చేస్తున్నారు. ఈ విషయమే జాతీయ విముక్తి ఉద్యమాన్ని ఒక బ్రహ్మాండమైనశక్తిగా రూపొందిస్తున్నది.

ఈ ఉద్యమం దాని అభివృద్ధి క్రమంలో ఈ లక్షణాలను అట్టిపెట్టుకొన గలిగినట్లయితే, శాంతియుత నిర్మాణ కార్యకలాపాలలో విజయాన్ని పొంది తీరుతుంది. కొన్ని ఆసియా దేశాలు చూపుతున్నమార్గం దీనినే సూచిస్తుంది.

బాండుంగ్ మహాసభ సమయంలో ఆసియా, ఆఫ్రికా దేశాలు సమైక్యతను కాపాడడం విషయంలో ప్రదర్శించిన ధోరణి, శాంతి, అభ్యుదయాలకొరకు ఆసియా, ఆఫ్రికా ప్రజలు జరుపుతున్న పోరాటాన్ని మరింత విజయవంతం గావించడంలో నిస్సందేహంగా గొప్పపాత్రను వహిస్తుంది.

సంక్షిప్తకథ

# చినిగిన సైనికకోటు వేసుకొన్న వృద్ధుడు

కాన్‌స్తాన్‌తిన్ పావ్‌స్తోవ్‌స్కి

ఇక్కడ చెప్పినదంతా వాస్తవ కథ. కలనల్ ఉద్యోగంనుంచి విరమించుకొన్న ఆ వృద్ధుడు చెప్పిన ఈ కథ, నాకు జ్ఞాపకం వున్నంతవరకు యథాతథంగా చెప్పాను. నాకు బాగా స్ఫురణకు రావడంలేదిగ్గానీ ఆ వృద్ధుడి పేరే—బహుశా గవ్రీలోవ్ అనుకుంటా. ఏమైనా, ఇది ఇదమిద్ధంగా చెప్పలేను.

—రచయిత



పొలాలమధ్య, పొదలమధ్య మాటు మణిగివున్న వేలాది గ్రామాలు మా రష్యాలో వున్నాయి. ఆకాశపు బూడిద వర్ణంలాగా, రైతు బాలల రంగు జుత్తులాగా వేలాది గ్రామాలు మాకు సుపరిచితమైనవి.

1924 వేసంగి, ఎఫ్రెమోవ్‌కు సమీపంలో వున్న బొగోవో గ్రామంలో గడిపాను. అక్కడ వుంటున్న కొత్తల్లో—బొగొవోలో కలనల్ ఉద్యోగంచేసి విరమించుకొన్న వృద్ధుడొకడు వుంటున్నాడనీ, ఎప్పుడూ ఎవ్వరితో ధారాళంగా మాట్లాడడనీ, ఒంటరిగా కాలం వెళ్ళబుచ్చుతూంటాడనీ నేను తెలుసుకున్నాను. ఆయన బొగొవోలో ఎందుకు నివాసం ఏర్పరచుకొన్నాడో ఏ ఒక్కడూ, చెప్పలేక పోయినాడు.

"ఆయన ఇక్కడుంటున్నాడు. అదొక్కటే అతన్ని గురించి మాకు తెలిసింది!" అన్నారు రైతులు. "ఎవ్వరికీ ఏహానీ కలిగించినట్టు మేం వినలేదు. ఒక యిల్లు కిరాయికి తీసుకున్నాడు. తన వంట తానే చేసుకుంటాడు, బింగాళా దుంపలు వండుకుంటాడు, పొద్దుపొడిచి పొద్దుగూకినదాకా నదివొడ్డున చేపలు పడుతుంటాడు. అంతకన్నా అలాంటి వృద్ధుడు మరొకటి ఏం చేస్తాడనుకుంటారు, మీరు?"

"ఆయన, ఇక్కడ అసలు వుంటున్నది దేనికి?"

"ఎవరు చెప్పగలరు? మేం వెళ్ళి ఆయన్ను అడగలేము. నిరుడిక్కడికి వచ్చాడు. అ రావడం రావడం ఇక్కడే వుండిపొయ్యాడు. మా జిల్లా అతిప్రశాంతమైన జిల్లా. అట్లాంటి పూర్వోద్యోగికి, ఇక్కడ ఏ గొడవా, ఏ బాదరబందీ వుండదు. ఎవ్వరూ ఆయన విషయంలో జోక్యం కలిగించుకోరు. మీకు తెలుసా, పూర్వోద్యోగులకు ఇప్పుడు రోజులు ఎట్లా వున్నాయో? ప్లేగంటే దూరదూరం పోయినట్టు ప్రజలు వాళ్ళను తప్పుక తిరుగుతుంటారు.

క్రసివయ మెచా తీరాన, మిల్లు అనకట్ట దగ్గర పూర్వోద్యోగి ఆ కలనల్ నాకు ఎదురు పడ్డాడు.

ఆ రోజంతా చలిగా వుంది, సాధారణంగా వేసవి మధ్యలో ఒక్కొక్కప్పుడు ఇట్లాగే వుంటుంది. మబ్బులు భారంగా భూమిమీద తారాడుతున్నట్టుంది, ఒకటి రెండు వాన చుక్కలుకూడా పడ్డాయి.

మిల్లుదగ్గరి ఈ కొలనుకు నేను చేపలు పట్టడానికి వచ్చాను. ఆయనో దూలంమీద అనకట్ట దగ్గర కూర్చుని వున్నాడు. సన్నగా వున్నాడు ఆ వృద్ధుడు. బారుగా వుంది నెరసిన గడ్డం. సైనికాధికారి కోటు ఒకటి పాతది వేసుకొని, బూడిద వర్ణపు టోపీ పెట్టుకున్నాడు. నల్లటి సాదా గుండీలు వున్నాయి ఆ కోటుకు సైనికుల కోటుకువుండే ఇత్తడి గుండీలుండే చోట ఆడవాళ్ళ గౌనుకువుండే ఆ గుండీలు, కుట్టి వున్నాయి.

పొట్టిగా దళసరిగా వున్న పైపుతో పొగ త్రాగుతున్నాడు, అదో గ్యాసుపైపు బెజ్జుతో తయారు చేయబడినట్టుగా వుంది. చాలా బరువుగా వుండొచ్చు కూడా. పొగాకు బూడిద విదల్చను ఆయన దాన్ని దూలంమీద కొట్టుతున్నప్పుడు, బలమైన సుత్తితో మేకులు కొడుతున్నంత చప్పుడు వచ్చింది.

ఏదో ఒక గాలంతో చేపలు పట్టుతున్నట్టున్నాడు. నేను వచ్చిన సంగతికూడా ఆ వృద్ధుడు పట్టించుకోలేదు.

సంధ్యా సమయానికల్లా మేం ఇద్దరం బొగొవో గ్రామం చేరుతున్నాం. తల వంచుకొని నేలమీద అంగుగుతీసి అడుగు వేసుకుంటూ

నదివాడేగాని, ఎంత సేపటికీ తల పైకెత్తడు. కళ్ళు పొడుచుకున్నా కనిపించని ఆ కటిక చీకట్లో ఊళ్లోకి వచ్చిందీ లేనిదీ తెలియడం లేదు.

దారిన నడుస్తున్నంతసేపూ, బటాణీలు ఎట్లా వండాలో, తప్పులు ఎన్నేవాళ్ళుంటారే వూళ్లో, వాళ్ళకు వేళ్ళుచూపటానికి వీలు లేకుండా ఎట్లా చెయ్యాలో చెబుతున్నాడు. ఆయనసలు ఎవరో, ఎందుకు ఈ బొగొవో గ్రామంలో కాపురం పెట్టాడో అడుగుదామనుకున్నా నాకు అవకాశం చిక్కనివ్వడంలేదు. అసలు నాకు తెలుసు. ఇక్కడ ఆయనకు అయినవాడుగానీ ఆప్తమిత్రుడంటూ ఎవరూ లేడని.

పటపట ధగధగలాడిన మబ్బులు క్రమక్రమంగా విప్పారాయి. తుంబోడి పక్షి కూతేసింది. చల్లటి చినుకులు రెండు గడ్డిమీద చిట చిట పడ్డాయి. సాయంత్రపు బడలికతో నా ఊహలుకూడా బరువెక్కాయి. వార్ధక్యపు ఒంటరి తనాన్ని గురించి. చిరిగిన సైనిక కోటు వేసుకొని ధ్యానముద్రలో నా ప్రక్కనే నడుస్తున్న వృద్ధుణ్ణి గురించీ ఆలోచనలు కలుగుతున్నాయి.

మా సంభాషణ మధ్యలో ఒకసారి, మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు, పోలెండులోని ఓస్వొవ్స్ దుర్గంలో పనిచేస్తుండే వాడినని ఆ వృద్ధుడు చెప్పాడు. అక్కడినుంచి వస్తూండగా నిజాని కొక మంచి గండు చేపను పట్టాడుట!

వేసవి వచ్చినట్టే వచ్చి గడిచిపోయింది, అయినా తన గతాన్ని గురించి రెండు ముక్కలు చెప్పడానికి ఇంకా ఆ వృద్ధుడు విముఖంగానే వున్నాడు. దాన్నిగురించి ఇంక అడగడంకూడా నాకు దుస్సాధ్యమైంది. ఒకసారి కాస్త అడిగీ అడగనట్టు నేను తిప్పి తిప్పి మీకేమైనా సాయంకావాలా అన్నాను. వృద్ధుడు నవ్వాడేకాని యేమీ చెప్పలేదు.

రోజులు గడిచినకొద్దీ. ఆ వృద్ధుడి పూర్వాపరాలు ఏమిటో తెలుసుకోవడం మరీ కష్టమైపోతున్నది. ముఖ్యంగా ఆయనకు ఎఫ్రెమోవో నుంచి నెలకోసారి సమన్లు వస్తుంటాయని. వాటినందుకొని ఆయన అక్కడికి వెళ్ళి ప్రయాణ బడలికతో వున్నట్టు తిరిగి వచ్చేప్పుడు కనిపించినా, ఏదో ఒక రకంగా సంతృప్తితో వుంటుండడాన్నిబట్టి ఈ అపూర్వ రహస్యం ఏమిటో మరీ దుర్గ్రాహ్యంగా వుండేది. ఎఫ్రిమోవోకు వెళ్లి వచ్చేటప్పుడల్లా గ్రామబాలలకు, తన పొరుగింటి పిల్లలతల్లి నాస్త్యాకు బహుమతులు తెచ్చేవాడు. నాస్త్యా మధ్యవయస్కురాలు, భర్తను విడిచిపెట్టి యధేచ్ఛగా వుంటున్నది. పిల్లలకు కరకర నమిలే బిళ్ళలు, ఛాక్‌లెట్లవంటివి, నాస్త్యాకు ఒక టీ బొట్లామో, దారపు వుండో తీసుకవచ్చేవాడు.

* * *

ఆకురాలుకాలం వచ్చేటప్పటికి, చిట్టచివరకు నేను మాస్కోకు వెళ్ళడానికి సన్నాహాలు చేసుకున్నాను.

కొన్నిచోట్లుంటాయి. వాటిని విడిచిపెట్టి వెళ్తున్నప్పుడు మళ్ళీ తిరిగి అక్కడికే వద్దామనే సంకల్పం కలగుతుంటుంది. ఒకచోటను శాశ్వతంగా విడిచిపెట్టిపోవడంకన్నా పైవిధంగా చెయ్యడం తేలిక. మంచికే అయినప్పటికీ ఒక చోటును విడిచి, ఇంకోచోటికి పోతున్నప్పుడు ఒకవిధమైన బాధ కలగకపోదు. అటువంటప్పుడు నీకు సహజంగా నీ హృదయంలో ఒకభాగం అక్కడే విడిచిపెట్టి వెళ్తున్నట్టు అనిపిస్తుంది కూడా.

ఉన్నచోటు మనకు యోగ్యంగా వున్నా. లేకున్నా. ఒకవేళ అక్కడ రోజులు భారంగా దొర్లించుకపోవలసివచ్చినా. లేకున్నా. అక్కడ ఎంత విసుగెత్తి పోయినా దాన్ని విడిచిపెట్టి పోతున్నప్పుడు ఎంతో విచారం కలగుతుంది, దాన్ని విడిచిపెట్టేటప్పుడు దానిమీద ప్రేమ వినా మరోటి వుండదు.

మాస్కోకు పోబోయేముందు, చిట్టచివరిసారిగా ఆ వృద్ధుడితో చేపలు పట్టడానికి వెళ్ళాను. ఆయన పేరు, పైతోర్ సెవ్నొవిచ్ అని మాత్రం తెలిసింది. వానలైతే తిరుగుముఖం పట్టాయికానీ. ముసురు పట్టినట్టు పొరలా కమ్ముకున్న మంచు రోజుల తరబడి విడిపోకుండా వుంటున్నది. దట్టంగా పట్టిన మంచుకప్పు మిట్టమధ్యాహ్నపు టప్పుడు కూడా విడిపోవడంలేదు.

మాస్కోలో ఆయనకు నేను చేసిపెట్టదగిన పనేదైనా వుందేమో చెప్పమని అడిగాను.

"ఆయన్ను అడిగినందుకు మాత్రం నాకు ధన్యవాదాలని, "ఏంవుంది....ఏమీలేద"ని.... "ఇంక మళ్లీ నేను మాస్కో చూడగలననుకోను. ఇంక యీ కడపటి నాలుగురోజులూ ఇక్కడ వెళ్ళబుచ్చుకోవలసిందే. నేను పోవడానికి ఇంకో చోటంటూ యెక్కడ వున్నది, ఎందుకుగాను పోవాలి? నేను ఒక వృద్ధ బ్రహ్మచారిని. భార్యా, పిల్లలూ లేకపోగా స్నేహితులనేవాళ్ళూ లేరు. నాకు వున్నారనుకున్నవాళ్లల్లా మరణించనైనా మరణించి వుంటారు లేదా తలొకతెన్నైవుంటారు. నిజం చెప్పాలంటే ఆ పాతసైన్యంలో స్నేహితులంటూ ఎవ్వరూ లేరు. అఖరుకి ఒక్కడు కూడా లేడు."

"ఎందుకు?" అని నేనడిగాను.

"ఎందుకో చెప్పడం అంత తేలిక విషయంకాదు. నేను ఒక సైనిక పుత్రుణ్ణి మా తండ్రిగారు కార్పొరల్‌గా పనిచేశారు. పూర్వ కాలపు వాళ్ళు చెప్పినట్టు చెప్పాలంటే సర్వసామాన్యమైన ముజిక్ కుటుంబంలో నుంచి వచ్చాను. మామూలు మనిషిని. నా న్యాయశీలాన్ని బట్టి ఫిరంగి బారు పెట్టడంలో నేర్పునుబట్టి నలుగురు నన్ను సహించారు. ఫిరంగి బారుపెట్టడం నాకు బాగా వచ్చు."

"మీరెందుకు వివాహం చేసుకోలేదు?"

"అందుకే నేను కాస్త విచారపడుతున్నాను ఇప్పుడు." అన్నాడు ఆ వృద్ధుడు, క్షణం విశ్రాంతి తీసుకోబోతూ. చేతిలోని ఆ గాలాన్ని ఊతగా తీసుకొని కాసేపు నిల్చుని, అంత నడుంవాల్చినట్టు వాల్చి, వ్యాకులంగా వున్నాడు. శోకతులమైన డాన్ క్విక్సోట్ ముఖం ఒక్కసారి నాకు స్ఫురణకు వచ్చింది. అతని కళ్ళు జ్యోతులలాగున్నాయి. ఎర్రటి చదరపు గళ్లున్న చేతిరుమాలు తీసి నీరు క్రమ్మిన కళ్ళను తుడుచుకున్నాడు.

"ఎందుకు చేసుకోలేదన్నదే ఇప్పుడు నాకు విచారం కలుగుతున్నది" అన్నాడు. మరోసారి వూపిరి పీలుస్తూ. ఎంతోమంది ఆఫీసర్ల భార్యలను చూచాను. నాకో కూతురో కొడుకో లేనందుకు నిర్లక్ష్యంగా చూచేవాళ్ళు. మనం శ్రద్ధతీసుకోవలసిన వాళ్ళంటూ లేనప్పుడు జీవితం వొట్టి గుల్లగా. శూన్యంగా అవుతుంది. ఒక విధమైన శైత్యం అంతటా ఆవరించుకపోతుంది. అందుకనే ఇతరుల పిల్లల్తో ఆడుతుంటాను.

అప్పటికి నేను అంత ధైర్యం తెచ్చుకొని "బొగోవకు మీరు రావడం ఎట్లా జరిగిందని." అడిగాను.

"అదా, మిత్రమా అదో పెద్ద కథ" అన్నాడు.

"నేను ఒకవేళ అదంతా మీకు చెప్పినప్పటికీ మీరు నమ్మలేరు. నేను ఇక్కడికి రావడానికి కారణం తేలికగానే చెప్పొచ్చు. నేను ఈ క్రసివాయా మేచా నదిని గురించి విన్నాను. ఇక్కడి సౌందర్యాలను గురించి విన్నాను, ఆ తర్వాత నా చివరి రోజులు ఇక్కడే గడపడానికి నిశ్చయించుకొన్నాను. నేను ఈ నిర్ణయానికి రాబోయేముందు. ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఇప్పటికీ అట్లాంటి ఘటన ఒకటి జరిగిందా అని నమ్మలేకుండా వున్నాను."

"ఆశ్చర్యకరమైన ఆ సంఘటన ఏమిటి ?"

"ఈ రోజుల్లో, మీరు నిజానికి ఎంతో బలహీనులు, దేనికీ ఓర్చుకోలేరు" అన్నాడు కాస్త వెటకారంగా. "నేను కాస్త నింపాదిగా మీకో కథ చెబుదామనుకుంటున్నాను. మీ కేమో మరి తొందరాయెను, ఏం పని లేకున్నా దానికి తోడు ఓర్పుకూడా కరువాయెను."

"సరే కానివ్వండి, పైతొర్ స్తెపనొవిచ్" అని ఏదో తప్పు చేసినట్టు నేను "మీ కథకు ఇంక నేను ఏమాత్రం అడ్డంకి పెట్టను, కానివ్వండి" అనేశాను కూడా.

"మంచిది. విప్లవం వచ్చేటప్పటికి చూడు, నేను కల్యాజిన్ పట్టణంలో వున్నాను, ఉద్యోగ విరమణమైన వాళ్ళ పేర్ల పట్టికలోకి నా పేరుకూడా ఎక్కింది. సహజంగా అప్పటికి నా పెన్షన్ కూడా అయిపోయింది. కలనల్ కోటుకువుండే భుజపు చారలు, రాబందుల జంట బొమ్మ వున్న ఇత్తడిగుండీలు తీసేశాను. మామూలుగా పౌరులు వేసుకునే కోటు ఒకటి సంపాయించలేక పోయాను. దాన్ని కావాలని కోరడం నాకో తలకుమించిన వరమనిపించింది. కల్యాజిన్ విడిచిపెట్టి, ఎరిగిన వాళ్ళంటూ లేని ఇంకొకచోట తలదాచుకోవాలనిపించింది. ఈ కల్యాజిన్‌లో నంటావా, ఇక్కడ ముఖాన ముక్కు పాతుకపోయి నట్టు నేను పాతుకపోయ్యాను. గుంపుగా వున్న జనంలో ఎక్కడో క్కడ కలిసిపోక తప్పదని నాకు తెలుసు. ఇంక మాస్కోలాంటి చోట తప్పితే జనం గుంపులు గుంపులుగా ఎక్కడ ఎక్కువ గా వుంటారు ? అందుకని నేను మాస్కోకు వెళ్ళి, పెత్రొవ్‌స్కీ పార్కు దగ్గిర ఒక వితంతువు న్న ఇంట్లో ఒక మూలగది అద్దెకు తీసుకున్నాను. నా పెన్షన్ డబ్బంతా ఖర్చు అయిపోయింది అందుకే అతికష్టంమీద రోజులు వెళ్ళదీసుకొస్తున్నాను. ఇంటి యజమానురాలు బాగా కండ పుష్టిగల మనిషే మనస్సు మాత్రం బహుమెత్తన. మరీ జబ్బునేతాక ఆవిడలో బ్రహ్మాండమయిన మార్పు వచ్చింది. హృద్రోగంవల్ల బాధ పడుతుండేది. ఆమెకొక కుమార్తెకూడా వుంది, ఆవిడ కోమ్సొమోల్ (యువ కమ్యూనిస్ట్ లీగ్) సభ్యురాలు ఆవిడ నా ఉనికిని గమనించి నట్టుకూడా కనిపించదు ఈరోజుకూడా. ఆవిడ అసలు నేనక్క డుండడం గమనించలేదో, గమనించీ గమనించనట్టు నటించేదో నాకు తెలియదు. సూటిగా చెప్పాలంటే నాతో కలసిమెలసి పోగలగడం ఎంతో సులభమే. మరీ అప్పటి నా గడ్డురోజులలో నయితే యింకా సులభం. నాలాంటి వాళ్ళు అనుసరించే సూత్రం ఒక్కటే ఒక్కటి. 'కష్టం విన్నా కష్టపెట్టేదాకా నువ్వు కించపడవద్దు.' నిజంగా జారు సైన్యం, ప్రజలకు కన్నెర్ర అయిపోయింది. ఈ సంగతి నాకు ఎప్పుడూ గుర్తుండేది. ఎవరు చేసిన చేతలకు వాళ్లు ప్రతిఫలం అనుభ వించక తప్పదు. మీరు నవ్వుతారేమో. నేను క్రియకు ప్రతిఫలం అనుభవించక తప్పదన్న సూత్రాన్ని ఎప్పుడూ విశ్వసించేవాణ్ణి.

"అవును, ఆ రోజుల్లో నేను కనాకష్టపు కనిష్టపు బ్రతుకు బ్రతుకుతుండేవాణ్ణి. నా చేతుల్లోని చిట్టచివరి కోపెక్ అయిపోయిందాకా నేను అదే బ్రతుకు బ్రతికాను. చావటానికి ఎవరికీ మనసొప్పదు నేను చస్తే, ఆలోచించను ఒక్క ఇంటి యజమానురాలు వినా మరొకరెవరూ లేరుకూడా. ఎట్లా ఈ కష్టాలు గట్టెక్కడని కంటికి కూర్కు లేకుండా అహోరాత్రాలు ఆలోచిస్తూ రెండురోజులు గడిపాను. ఆసాంతానికి తేలినదేమంటే అడుక్కుతిందామని."

మాట్లాడుతున్నవాడల్లా కాస్త ఆగి, ఆశ్చర్య సూచ్యంగా నావంక చూచాడు :

"నిజానికి ఒక ముష్టివాడై పోవడం మీరు ఊహించుకోగలరా ! అట్లా అయిపోదామని జీవితంలో నేనెన్నడూ అనుకోలేదు కూడా. ముష్టి యెత్తుకోవడం, నిండు ప్రాణాలతో క్రుళ్ళిపోవడమే. ఆ పరిస్థితిలో తన్నుతాను అసహ్యించుకోకుండా ఎవరూ ఉండలేరు. నామటుకు నాకు, భగవంతుడా చచ్చిపోతే బాగు ననిపించేది. అదావు ఏరూపంలో నైనా రానీ, అదెంత కనిష్టమైందయినా కానీ. లజ్జాకరమైన ఈ బ్రతుకు బ్రతకడం దుర్భరమనిపించేది. కొందరు, ఆ దుస్సహమైన బ్రతుక్కు కూడా అలవాటు పడిపోతారు. అడుక్కు తినడంలోకూడా యెట్లా అడుక్కోవాలో తెలియాలి, దానికీ మంచి అనుభవం, లాఘవం, ఎంతో నటనా సామర్థ్యం కావాలి. నాకు ఈ గుణాలేవీ లేవు.

"అయినా, పెత్రొవస్కీ పార్కుదగ్గర బిచ్చమెత్తడం మొదలు పెట్టాను. కాస్త మా ఇంటికి అంతదూరంలో, చేతికర్రతో ఒంటరిగా నిల్చొని, తలవంచుకొని నాలో నేను గొణుక్కున్నట్టు "ఇల్లూ వాకిలీ లేని ఈ వృద్ధుడికి నాలుగు డబ్బులు దానం చేసుకోండీ, అంటుండే వాణ్ణి. అంత ఇదైనప్పటికీ వాళ్ళు బహుస్వల్పంగానే ఇచ్చేవాళ్ళని చెప్పక తప్పదు. ఎవరైనా నామీద కాస్త కనికరం చూపారంటే అది నా కోటును చూచేనని చెప్పక తప్పదు. ఒక్కొక్కసారి కొందరు, కోపంతో నా తల బ్రద్దలయేటంత బాధ కలిగించేవాళ్లు. అయితేమటుకు నేను చేయగలిగిందేమిటి, ఓర్చుకొని నన్ను నేను సముదాయించుకొనే వాణ్ణి.

"సాయంత్రానికి మంచి అలసటతో ఇల్లు చేరుకొనే వాణ్ణి వాటి ముఖంవంక చూటనట్టుగానే ఆ దొరికినడబ్బులు లెక్కపెట్టుకునేవాణ్ణి. నా తల దిమ్మతిరిగి పొయ్యేది. మీరు నమ్మతారా, కొన్నికొన్ని సమ యాలలో నేను ఆత్మహత్య చేసుకుందామనుకున్నానని ? ఈ జరిగిన సంఘటనే గనక జరుగివుండ నట్టయితే, నిజానికి నేను ఎంతోకాలం క్రితం మరణించి వుండేవాణ్ణి."

నడుచుకుంటూ తిన్నగావెళ్ళి, మేం ఇద్దరం, పైతొర్ స్తెపొనొవిచ్, మామూలుగా మిల్లు కొలను దగ్గర కూర్చునే పొడిపొడిగావున్న దూలంమీద కూర్చున్నాం.

"ఇక్కడ కాస్త చలిపెడుతున్నది" అన్నాడు ఆయన, తన కోటు కాలర్ను పైకెత్తుతూ. ఆ కాలర్ అడుగంతా మంచి నీలం రంగులో వుంది. పైనంతా రంగు బాగా చాయబోయి, పసుపుపచ్చ డాగులు పడ్డాయి.

"వేసవిలో ఒకరోజున," అని మళ్లీ మొదలుపెట్టాడు తనకథ, పైపు వెలిగిస్తూ, "నేను ఆవేళ తొందరగా ఇల్లు చేరుకున్నాను. ఒక పిల్లవాడు, నాకో అయిదు కోపెక్కుల నాణెం ఇచ్చాడు. రోజంతా ముష్టెత్తితే దొరికాయి అయిదు కోపెక్కులు ! ఆ పిల్లవాడు ఆ నాణె ముతో బాగా తనివితీర ఆడినట్టున్నాడు దిమ్మిసకొట్టినట్టు, బాగా నొక్కులు పడివున్నాయి. అసలు దాన్ని గుర్తుపట్టడానికి వీలు లేకుండా వుంది. ట్రామ్‌లో కండక్టర్‌కూడా దాన్ని పుచ్చుకుంటా డనుకోను వీల్లేదు. ఇంక చెల్లని నాణాలు చెల్లే బజార్లోకూడా అది చెలామణి అవుతుందనడానికి ఆస్కారం లేదు.

"అప్పటికి నాపాదాలు బాగా ఉబ్బాయి ఆ రాత్రే, ఇంక యీ బ్రతుకు చాలిద్దామనుకున్నాను. ఇంక ఏమాత్రం, బ్రతకడానికవి యీ పోరు సాగించలేకున్నాను. ఎందుకసలు ఇట్లా బ్రతకడం ? అయినా యింత గాఢంగా నేను ప్రేమించిన యీ సుక్షేత్రాన్ని, నిర్మలమైన ఆకాశాన్ని, సూర్యుణ్ణీ (అప్పుడే అస్తమిస్తున్నాడు), పక్షుల్నీ వృక్షాల్నీ విడిచిపెట్టిపోవడమంటే నమ్మ శక్యంకాకుండా వుంది.

"నేను బయటికి వెళ్ళి గేటుదగ్గరున్న ఒక బెంచీమీద కూర్చు న్నాను. ఆ రోజులలో పెత్రోవస్కీ పార్కువీధులు, గ్రామంలోని వీధుల్లాగా వుండేవి. వీధులనిండా గడ్డి దుబ్బుగా పెరిగి, ప్రక్కల గాలికి కొట్టుకొచ్చిన నిమ్మపండ్లు వరుసకట్టినట్టు పడివుండేవి.

"ఒక్క ఆలోచనకూడా లేకుండా తలకాయంతా శూన్యంగా

వుంది. వీధికి అడ్డంగా, అక్కడొక వైమానిక శిక్షణ పొందుతున్న విద్యార్థుల వసతిగృహం వుండేది. ఆ విద్యార్థిబృందం ఎప్పుడూ అందర్నీ ఎగతాళిపట్టిస్తూ, అల్లరి చేస్తుండేవాళ్ళు. ఎవర్నీ వాళ్ళు ఒంటరిగా పడుండనిచ్చేవాళ్ళుకారు, ముఖ్యంగా నన్నూ. నన్ను చూచీచూడడంతోటే వాళ్ల కేకవేసేవారు; "హి....హీ........ముసలి పీనుగ. వస్తుప్రదర్శనశాలలో పెట్టాల్సింది?" చెవిటివానిలా నటిస్తూ నాదారిన నేను పొయ్యేవాణ్ణి.

"నేను ఆ బెంచీమీద కూర్చుని వుండగా, ఒక పొట్టిమనిషి, నల్లటి సూటువేసుకొని, టోపీ పెట్టుకొని ఒక చెయ్యి జాకెట్టులో వెనక్కు పెట్టుకొని, నింపాదిగా నావైపు రావడం చూచాను. ఆయన ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు. మధ్యమధ్యన ఆగి, నిమ్మచెట్ల వంక ఆయన ఎందుకో చూచినట్టు చూస్తూ, మళ్లీ నడక సాగించేవారు. ఆయన నాదగ్గరకువచ్చి ఆగారు, త్వరత్వరగా ఏదో మాట్లాడుతూ, హాస్య ధోరణితో నన్ను ఇలా అడిగారు:

"ఇక్కడ మీతోపాటు నేను కూర్చోవచ్చునా?"

"ఎందుకు కూర్చోకూడదు," అంటూ నేను "ఈ బెంచీమీద ఎవరు కూర్చోదలచుకున్నా కూర్చోవచ్చు. కొస్త నాకు అంత దూరంగా మాత్రం కూర్చోవడం మంచిది,"అన్నాను.

కొస్త కళ్లు చిన్నవిచేసి, నావంక, నన్ను గురించి బాగా తెలుసుకోనన్నట్టు దీక్షగా చూస్తున్నారు.

"దూరంగా కూర్చోవడం దేనికి"అని అడిగారు.

"నేను ఏమీ జవాబు చెప్పలేదు. మళ్ళీ ఆయన అదేమాదిరి ప్రశ్నించారు.

"దూరంగా దేనికి కూర్చోవాలి?"

"అంతమాత్రం చూచి కనిపెట్టలేరా? అని నేను దగ్గుతూ బిచ్చగాణ్ణని చెప్పాను.

"అవును, మీరు చాలా గడ్డురోజులు గడుపుతున్నట్టున్నారు."

"ఇంతకంటే చెడురోజులు మరి ఇంక రావు! నేను ఈపాటి దాకా బ్రతికివున్నానంటే మానవులలోని దాతృత్వంవల్లనే. నేను అడుక్కుంటున్నాను."

"మీరు ఇంతకుముందు సైనికాధికారులా?" అని ఆయన అడిగారు.

"ఆ-అధికారినే. అధికారిని. ఒక కుక్కను, అచ్చుపోసిన మనిషిని, నన్ను గుర్తుపెట్టుకోనివాళ్ళుండరు!"

ఎందుకో ఆయన చిరునవ్వు నవ్వారు, ఆ నవ్వులో ఎంత కరుణ వుంది. నేను కొస్త గాభరా పడ్డాను.

"ఒక్కమాట" అంటూ ఆయన,"విషయాన్ని దాటెయ్యకండి. అధికార్లల్లోను రకంవారీ మనుషులుంటారని మీకు తెలుసును కదూ."

"ఆహా! ఎన్నిరకాల మనుషులున్నా అందరికీ జీతం ఒక్కటే. నేను ఓస్వెత్స్‌లో పనిచేసే రోజుల్లో సైనికులమీదికి కొట్లాటలకు దిగే అధికార్లుండేవారే. ఆ దుష్టులకు అంత దైవభీతి కలిగిస్తుండేవాణ్ని. రష్యన్ సైనికుడు ఒక ఋషి. మీకది, గుర్తుందా? మన చరిత్రను విరచించింది. మీవిప్లవాన్ని తెచ్చింది. రష్యన్ సైనిక హస్తాలేనని మీకు కావాలంటే చెప్పగలను!

"ఈ సంగతి చెబుతున్నప్పుడు ఆయన తల రిక్కించి, పక పక నవ్వారు. ఎల్లాంటినవ్వు. నేనూ ప్రతిహాసం చెయ్యకుండా ఊరు కోలేకపోయ్యాను. ఆయన నన్ను పాత సైన్యాన్ని గురించీ, ఓస్వెత్స్‌ను గురించీ, మొన్నటి యుద్ధాన్ని గురించీ ప్రశ్నించ మొదలుపెట్టారు. నాకు తెలిసినమటుకు చెప్పాను, పైగా ప్రసంగ వశాత్తు, మా మిలటరీవాళ్లకు యుద్ధసన్నాహాల గురించి, రహస్య సైనిక ఉత్తరువులద్వారా ముందుగానే తెలుసునని చెప్పాను. ముఖ్యముగా యీ సంగతిలో ఆయనకు ఎక్కువ ఆశక్తి కలిగినట్టుంది. "అట్లాగంటారా, బాగుంది, బాగుంది, ఆ తర్వాత ఏం జరిగింది?" అంటూ సూటిగా ఇట్లా ప్రశ్నించారు:

"విప్లవాన్ని గురించీ, బోల్షివిక్కుల గురించీ మీరేమని అభిప్రాయపడుతున్నారు, వాళ్ళు నెట్టుకరాగల రంటారా?"

"'ఏం, ఎందుకు నెట్టుకరాలేరు?' అన్నాను నేను. 'మీకు స్పష్టంగా కనిపించడం లేదూ? ప్రతిదీ బాగానే జరిగింది. వాళ్ళు చూడవలసినదల్లా మనుషులు ఆత్మ గౌరవాన్ని పోగొట్టుకోకుండా చూడడమే.'

"'మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. మీలాంటి కష్టకాలం ఎవ్వరికీ సంప్రాప్తం కాకూడదు. ఏ పరిస్థితుల్లోనైనాసరే. నేనొక చోటికి మీగురించి నాలుగు పంక్తులు వ్రాసిస్తాను. దాన్ని మీరు తీసుక పొండిఅక్కడికి, వాళ్ళు తప్పక మీకు సాయంచేస్తారని నా నమ్మకం.'

"ఆయన ఒక నోటు పుస్తకం తీసి తొందర తొందరగా నాలుగు ముక్కలు గిలికి, దాన్ని నాకిచ్చారు. అది తీసుకొని, ఆకాయి తాన్ని మడిచి జేబులోకి కుక్కాను. ఇట్లాంటి రాతలవల్ల ఫలితం ఏముంటుంది? పూర్వపు అధికారికి సాయపడతారని ఎవరైతేమటుకు ఎట్లా నమ్మగలరు? అయినప్పటికీ ఆయన నాపట్ల చూపించిన కని కారానికి కృతజ్ఞతలు చెప్పాను. ఆ తర్వాత ఆయన వెళ్ళిపోయ్యారు.

"వెళ్ళిపోతుంటే ఆయన్ను నేను పిలిచి, 'ఇక్కడ గాలికోసర మని షికారుచెయ్యడం మీకు అలవాటేనా? అని అడిగాను.

"'అవును' నాకు జబ్బుగావుంటే రోజూ కొస్త గాలికి తిరగ మని డాక్టర్లు సలహా చెప్పారు, అన్నా రాయన.

"ఆ ముక్క జెప్పి ఆయన వెళ్ళారు. ఆయన్ను కలుసుకున్నాక నాగుండెలమీద బరువు దించేసినట్టయింది. చూడండి, నాలో నా కనిపించింది, ఇంకా మన ఈ ప్రపంచంలో దయార్ద్ర హృదయులు కొందరు కనిపిస్తుంటారు. ఎప్పుడో అధికార్నే కావొచ్చు, ఇప్పుడు ముష్టివాణ్ణి, అయినా నాతో ఎంతబాగా మాట్లాడారు.

"ఈ సంఘటన నంతా నెమరువేసుకుంటూ నేను అక్కడే కూర్చునివుండగా, వైమానిక విద్యార్థులు నాదగ్గరకు పరుగెత్తుక రావడం చూచాను. ఏ కారణంచేతనో వాళ్ళంతా తెల్లపోయి విహ్వల నేత్రులైవున్నారు. నాదగ్గరకు పరుగెత్తుకుంటూవచ్చి, ఇట్లా అన్నారు:

"'ఇప్పు దెవరితో మాట్లాడావో నీకు తెలుసా?'

ఆయన ఎవరో నాకు ఎట్లా తెలుస్తుంది? 'ముసలి పీనుగ' 'ప్రదర్శనశాల అస్థి సంచయంలో పెట్టాలట!' వాళ్ల పరాచకానికి అనే మాటలకు నా వొళ్లు మండిపోయింది. నఖశిఖ పర్యంతం కోపంతో కంపించిపోయాను.

"అవును. ఆయనెవరో నాకుతెలుసు, మీరిక్కడినుంచి పోండి, మీకు తెలిసిందల్లా ఒక వృద్ధుణ్ణి హేళన చెయ్యడమే."

"నా వాలకం చూచి వాళ్ళు గడగడలాడి పోతున్నట్టున్నారు, చిన్న బుచ్చుకుని అందరూ కాలికి బుద్ధి చెప్పారు. ఆ సాయంత్రం, ఆ విద్యార్థుల్లో ఒకడు, నాకో టీ పొట్లం, పౌనుకు తక్కువ కాకుండా పంచదార తెచ్చిచ్చాడు.

'వాళ్ళల్లో ఇంత మార్పు ఎట్లా వచ్చింది?' అని నేను ఆలోచించాను. 'నేను నా మనస్సులో వున్న కోపాన్ని బయటపెట్టాను కాబట్టి, నాకు కష్టం కలిగించామని వాళ్ళు బాధపడివుంటాడు. ఇంతకూ వాళ్ళు అంతచెడ్డ వాళ్ళేం కాకపోవచ్చు!'

"నా కెప్పుడూ చిన్నవాళ్ళంటే ఎంతో ఇష్టం. వాళ్ళకోసం కాకపోతే వయసొచ్చిన మనం బ్రతకడం వృథా. వాళ్ళకోసం కాకపోతే మన బ్రతుకు విసుగెత్తిపోతుంది. అందుకనే అసలు ఆ విద్యార్థులపట్ల నేను ఏమాత్రం క్రోధం పెట్టుకోలేను.

"చూశారూ, అట్లాగే నేను అనుకుంటున్నాను. మరి చేసేదేముంది? ఆయన రాసిచ్చిన చీటీమాట పూర్తిగా మరిచిపోయ్యాను. నా దగ్గర మిగిలివున్న "మంచు తర్వాత మాస్కో"అన్న దాన్లి విస్కీ రాసిన పుస్తకంలో దానిని పెట్టేసి మరచి పోయానంటే మీరు ఊహించగలరా నా సంగతి? హేమంతం వచ్చేటప్పటికిపరిస్థితులు ఎంత విషమించాయంటే నాకు ఏ మంచులోనో పడి చస్తాననుకున్నాను. అప్పుడు ఈ చీటీమాట స్ఫురణకు వచ్చింది. అదంతా నమిలినట్టు బాగా నలిగిపోయింది.

అది ఏదో ఒక ప్రభుత్వశాఖకు వ్రాయబడ్డట్టుంది. పేరు నేను తెలుసుకోలేక పోయ్యాను. అంత భయంకరంగా చూపువేసిన ఆ కాయితాన్ని తీసుకొని ఒక కార్యాలయం చుట్టూ తిరగడానికి నాకు మనస్కరించలేదు. దాన్ని పట్టుకపోవాలంటె నాకే అసహ్యమనిపించింది. కాగా ఆ కార్యాలయం ఎంతో దూరంలో, నగర మధ్యానవుంది. విప్లవం మొదలుపెట్టాక అటువైపు ఎన్నడూ నేను వెళ్ళలేదు కూడా. కాస్త తటపటాయించి చిట్టచివరకు అక్కడికి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను. కాగా మా ఇంటి యజమానురాలు కూడా వెళ్ళమని వొత్తిడి పెట్టింది. 'పైతొర్ స్తెపొనిచ్, మీరిలా పిల్లవాడిలా చేస్తే ఎట్లా' 'మీ నీడనుచూచి మీరే భయపడతారే. ఇట్లాంటివారు ఎట్లా కలనల్ పని చేశారో, బల్శోయ్ హిస్టరీ చెప్పాల్సింది, తుపాకులు కొట్టడంకాదు మీరు నేర్చాల్సింది' అన్నది కూడా.

అంతసేపూ తల వొంచుకొని, నేలవంక చూస్తున్నానే కాని కళ్ళు పైకెత్తలేదు. ముసలితనం మొదలు పెట్టినప్పటినుంచీ ప్రజల కంటబడకుండా ఇదో కొత్త అలవాటు చేసుకొన్నాను. నిజంగా ప్రజల్ని తప్పించుకోను అది, ఎంతో సులభ సాధన. నాకు ఇప్పటికీ ఇంకా ఈ అలవాటు పోలేదు. మీరు కనిపెట్టే వుంటారనుకుంటా. ముసలివాళ్ళ అలవాట్లు బహు బలీయమైనవి.

"ఎట్లాగైతేనేం, చిట్టచివరకు ఆ కార్యాలయానికి వెళ్ళాను. అదొక పెద్ద భవనం. లోపల అంతా అతి ప్రశాంతంగా వుంది. ఎక్కడ చూచినా తివాసీలే. ద్వారపాలకుడను కుంటాను, ఇప్పుడేదైనా కొత్తపేరు పెట్టారేమో. 'పౌర మహాశయా, మీరు దయచేసి ఆ కోటు విప్పేసెయ్యండి' అన్నాడు కాస్త తీవిగా. ఎట్లా విప్పను, లోపల ఇంకేమి వేసుకోలేదు. 'దయచేసి ముసలివాణ్ణి అంత నిర్బంధించకండి' అని ఎంతో అతనితో ప్రాధేయపడ్డాను. 'నన్ను ఇక్కడ అవమానానికి గురిచెయ్యకండి. ఇదిగో చీటీ పట్టుకొచ్చాను పనిమీద' అని కూడా అన్నాను. ఆ చీటీని ఆయనకూ చూపించాను. దానివంక చూస్తూనే నన్ను అదోవిధంగా చూడ మొదలుపెట్టాడు. ఒక కుర్చీని లాగి, దయచేసి ఇక్కడ కూర్చోండి. మీరు వచ్చారని నేను తెలియజేస్తాను, ఇప్పుడే' అని ఎంతో వినయంగా మాట్లాడుతూ, అతను బయటికి వెళ్ళాడు. వెంటనే తిరిగివస్తూ కళ్ళజోడు పెట్టుకున్న మధ్య వయస్కుణ్ణి, ఒకర్ని పిలుచుకొచ్చాడు, ఆయన యెంతో తీవిగా కనుపిస్తున్నాడు. స్మితవదనుడు. ఆయన నా చెయ్యిపట్టుకొని దారి తీస్తున్నారు. ఆయన ప్రక్కనే నడుస్తున్నప్పుడు, నా బూట్ల చినుగుల మీదుగా మంచుముద్దలు కాలిమీద పడుతున్నాయి. ఇంత నాకెప్పుడూ సిగ్గనిపించలేదు.

"ఆయన నన్నో గదిలోకి తీసుకెళ్ళి తోలుబద్దీ చేతులకు వేసివున్న ఒక పెద్ద కుర్చీలో కూర్చోబెట్టారు. నాదగ్గర పూర్వపు ఉద్యోగానికి సంబంధించిన సాధికార పత్రాలేమైనా వున్నవేమోనని అడిగారు. నా దగ్గరున్న కాయితాలన్నీ నేను ఆయన కిచ్చేశాను. అవి వుంటేమటుకేం పెద్దలాభం, నేను ప్రపంచానికి కాకుండా పోయ్యాను, పెత్తనం వచ్చింది? ఆయన నన్ను కూర్చుండమని వెళ్ళారు. నేను టైం చూసుకుంటూ కూర్చున్నాను. ఒక అరగంట తర్వాత ఈ పని పెట్టుకున్నందుకు, విచారించడం మొదలుపెట్టాను. పోదామంటే నా కాయితాలన్నీ ఆయన దగ్గరున్నాయి. సరిగ్గా అప్పుడే ఆయన తిరిగి వచ్చారు, చూపులనుబట్టి ఆయనో పెద్ద అధికారని స్పష్టమవుతున్నది. నాకో పెన్షన్ పుస్తకం, కొన్ని ఉత్తరువులు, ఆహారం, కట్టెలు, గుడ్డలు తీసుకోను, వైద్యచికిత్స పొందను ఉత్తరువు పత్రాలవంటివి కొన్ని ఆయన నా చేతికిచ్చి, నా సంతకం చేయించుకొని, కొన్ని బిల్లులకట్ట యిస్తూ 'ఇది మీ మొదటి పెన్షన్‌కు వచ్చిన మొత్తం. చాలాకాలం మీరు తిండికికూడా బాధపడి వుంటారు పాపం. అన్నారు.

'నా కళ్ళను నేను నమ్మలేకపోయ్యాను, చెక్కిళ్ళమీదు గాకన్నీరు జలజల రాలడం మొదలుపెట్టింది. 'మీరు అలా బాధ పడకూడదు, పైతొర్ స్తెపొనిచ్'అన్నారాయన. 'మాకు తెలుసు కృషిని ఎట్లా విలువగట్టాలో, ముఖ్యంగా తన విధ్యుక్తాన్ని ఎరిగిన వాళ్ల సేవల్ని. మీలాంటి విశ్వాసపాత్రుల సేవల్ని మేము మరచిపోము. మీ అర్హతలను బట్టి మీకిస్తున్నాము' అన్నారు. 'నా అర్హతల విషయం మీకు ఎట్లా తెలిసింది?' అని నే నడిగాను. 'మీసర్వీస్ రికార్డు మా దగ్గరేవుంది. దాన్ని సాకల్యంగా చదివాము.' భగవాన్! నా సర్వీస్ రికార్డు తెప్పించుకోవడం ఎట్లావుంది, ఒక్కసారి ఊహించుకోవాలి! బాగుంది, అంతా!

"పాత స్నేహితులలా ఒకరికొకరం వీడ్కోలు చెప్పుకొని విడిపోయ్యాము. నేను అట్లాగే సజల నేత్రాలతో తలపైకెత్తకుండా పెత్రొపవ్‌స్కీ పార్కుదారి పట్టాను ఆ అలవాటు నన్ను వదలిపెట్టకుండా అలానేవుంది.

త్వెర్స్కయా వీధికి వచ్చేటప్పటికి, చీకటిపడింది. వీధి లాంతర్లు వెలిగాయి. షాపు కిటికీలగుండా వెలుగులు వస్తున్నాయి. 'షాపులోకి వెళ్ళి రొట్టె, తినుబండారాలు మా ఇంటి యజమానురాలికి తీసుకెళ్ళి, ఒక చిన్న విందు చేద్దామనిపించింది నాకు.

"అప్పుడే మొట్టమొదటగా, ఇంటిదారిన పోతూ నేను అంత కళ్లు పైకెత్తి చూచాను! అప్పుడు నేను జీవిత స్పందన మొట్టమొదట అనుభవించాను. ఆ షాపు కిటికీలో ఒక చిత్రం వ్రేలాడుతున్నది. అది ఆయన చిత్రమే! అవును, మూర్తీభవించినట్లు ఆయనే! నాకు ఆ చీటి రాసిచ్చిన పొట్టిమనిషి! ఆ చిత్రం దిగువన వి. ఐ. లెనిన్ (ఉల్యనోవ్) అని ఆయన పేరుకూడా ముద్రితమైవుంది. ప్రక్కషాపులోకూడా ఆ చిత్రమే తగిలించబడివుంది. అయ్యో భగవంతుడా!

నా మనస్సు ఎందుకో పొంగులెత్తుతున్నది. ఏమీ కొనకుండానే తొందర తొందరగా ఇంట్లో వచ్చి వాలాను. నా వొళ్ళంతా కంపించి పోతున్నది. ప్రమాణపూర్తిగా చెబుతున్నాను, ఆయనకోసం నా వొంట్లో చిట్టచివరి నెత్తురుబొట్టుకూడా సమర్పిచ్చేద్దామనుకున్నాను. నాకు నేను కట్టుకున్న ఖైదులోనుంచి ఆ మహాపురుషుడు నన్ను విముక్తం చేశాడు. నా చెర తప్పించాడు నాకు స్వేచ్ఛను కల్పించాడు. నేను శాశ్వతంగా ఆయనకు ఋణపడి వున్నాను. ఆయన నాకు చేసిన

[మిగత 40వ పుటలో]

ప్రశ్న:—సోవియట్ దేశంలో వ్యవసాయ కార్మికుల జీవన పరిస్థితులు, పారిశ్రామిక కార్మికుల జీవన పరిస్థితులు ఒకేవిధంగా ఉన్నాయా; సమాన వేతనాలు దొరుకుతున్నాయా; ఒకేవిధమైన సదుపాయాలను, ఒకే విధమైన సాంఘిక హోదాను కలిగి వుంటున్నారా?

(శ్రీ కె.వి రామారావు, వ్యవసాయదారుడు, కొవ్వూర్, ఆంధ్ర)

సమాధానం:—(అఖిల దేశ ట్రేడ్ యూనియన్ల కేంద్ర సంఘం న్యాయశాఖ అధిపతి. ఐ ద్వోర్కిన్కోవ్). సోవియట్ దేశంలో రాజ్యాంగచట్టం పౌరులందరికి సమాన హక్కులను గ్యారంటీ చేస్తున్నది. దీని ప్రాతిపదిక మీద పారిశ్రామిక కార్మికులూ, వ్యవసాయ కార్మికులు గూడా సమాన సాంఘిక హక్కులను—పనికి, విశ్రాంతికి, విద్యకు, వృద్ధాప్యపు జీవనభృతి మొదలైనవాటికి హక్కులను—కలిగి వుంటున్నారు.

వ్యవసాయ రంగంలో, ప్రభుత్వ సంస్థల కొరకు (ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, మెషిన్, ట్రాక్టర్ స్టేషన్లు మొదలైనవి) ఉత్పత్తి సహకార సంఘాలతో సంఘటితమైన సమిష్టి వ్యవసాయక్షేత్ర కర్షకులకొరకు (సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు) కూలి పద్ధతిమీద పనిచేసే కార్మికులు ఉన్నారు.

పారిశ్రామిక కార్మికులకొరకు చేయబడిన కార్మిక చట్టాలు వ్యవసాయ కార్మికులకు గూడా వర్తిస్తాయి. వ్యవసాయ కార్మికులకు గ్యారంటీగల వేతనం, ప్రభుత్వ వ్యయంతో సాంవత్సరిక సెలవు, వృద్ధాప్యపు జీవనభృతి, అశక్తత జీవన భృతి తాత్కాలికంగా అశక్తస్థితి ఏర్పడినప్పుడు గ్రాంటులు మొదలైనవి లభిస్తాయి.

సమిష్టి వ్యవసాయక్షేత్రాల (రైతుల సంఘటితమైన సహకార సంఘాలు) సందర్భంలో, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల జనరల్ సమావేశంలో ఆమోదింపబడిన తీర్మానం ప్రకారం, వృద్ధాప్యంలోను, అశక్తత స్థితిలోను పోషణకు అయ్యే ఖర్చులు, సెలవులకు అయ్యే వ్యయం మొదలైనవి సమిష్టి వ్యవసాయక్షేత్రాల వేతనే భరింపబడుతాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోని ప్రతిరైతు ఆదాయం, సమిష్టివ్యవసాయం యొక్క మొత్తం ఆదాయంపైన, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేసిన పని రోజుపైన ఆధారపడి వుంటుంది. అంతేగాక, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకు తమ వ్యక్తిగత



ఐ ద్వోర్కిన్కోవ్. అఖిల దేశ ట్రేడ్ యూనియన్ల కేంద్ర సంఘం న్యాయ శాఖాధిపతి

భూములు (పండ్ల తోటలు, కాయగూరల తోటలు) నుండీ, స్వంత పశువులనుండి కూడా కొంత ఆదాయం లభిస్తుంది.

కాబట్టి "వ్యవసాయ కార్మికుల జీవన ప్రమాణము, పారిశ్రామిక కార్మికుల జీవన ప్రమాణము ఒకేవిధంగా వున్నవా" అన్న ప్రశ్నకు ఈ దిగువ విధంగా సమాధానం చెప్పవచ్చును; కొందరు సమిష్టి వ్యవసాయ క్షేత్రదారుల జీవన ప్రమాణం కొన్ని రకాల పారిశ్రామిక కార్మికుల జీవన ప్రమాణంకంటే హెచ్చుగా వున్నది; అదేవిధంగా కొందరు కార్మికులు, కొందరు సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకంటే బాగా జీవిస్తున్నారు.

ప్రశ్న:—సోవియట్ దేశంలో చేతితో పనిచేసే మగ్గాలుగల నేత ఫాక్టరీలు ఉన్నాయా? యీ పరిశ్రమ యొక్క స్వరూపాలు, విశిష్టత యెలాంటివి? (రుస్తుంబాద కొత్త నాగేశ్వర నేతకార్మికుల సహకారోత్పత్తి, విక్రయ సంఘం, లిమిటెడ్, నరసాపురం, పశ్చిమ గోదావరి జిల్లా). ఉత్తర ప్రదేశ్‌కు చెందిన అబ్దుస్ సలామ్ హుస్సేన్ రసా; వినాపత్రకు చెందిన సాధి విజ్ఞాన సమితి అధ్యక్షుడు, సంగిసెట్టి, లక్ష్మీపతి, పద్మశాలి, తదితరులలాంటి పాఠకులు కూడా సోవియట్ దేశంలోని చేనేతపరిశ్రమను గురించి వ్రాయమని అడుగుతున్నారు.

సమాధానం:—విప్లవానికి పూర్వం రష్యాలో చేనేత పరిశ్రమ విస్తృతంగా వుండేది. జనాభాలో అధికభాగం చేనేతగుడ్డలనే ధరిస్తుండేవారు. ఇప్పుడు లినెన్‌గుడ్డలు, ఊలుగుడ్డలు, నూలు గుడ్డలు అత్యంత శక్తివంతమైన మగ్గాలు, యంత్రాలను కలిగిఉన్న ఫాక్టరీలలో ఉత్పత్తి చేయబడుతున్నాయి.

అత్యంత కళాత్మకము, అపురూపము అయిన వస్తువుల ఉత్పత్తికొరకు చేనేత పరిశ్రమ పరిపోషింపబడుతున్నది చేతిమగ్గాల నుపయోగిస్తూ అందమైన గుడ్డలను, తివాసీలను, అలంకరణకు ఉపయోగించే జలతారు తెరలను నేసే అత్యంత ప్రవీణులైన చేనేత పనివారల చేనేత సహకార సంఘాలు ఉక్రెయిన్, ట్రాన్స్‌కాకసస్, మధ్యఆసియా రిపబ్లిక్‌లు, మాస్కో, మాస్కో పరిసరాలలో పనిచేస్తున్నాయి.

సాంకేతికంగాను, పారిశ్రామికంగాను విషయాలు యెంత అభివృద్ధిని పొందినప్పటికీ, లాలిత్యము, చాతుర్యము అవసరమైన యీ చేతిపనుల ఆవశ్యకత యెన్నడు తగ్గదు. అపురూపమైన ఈలాంటి బట్టలనేత ఒక కళగాబట్టి యంత్రాలు ఈ పనిని నెరవేర్చలేవు.

ప్రశ్న:—సోవియట్ న్యాయ చట్టానుసారం విధిగా పనిచేయాలా? సోవియట్ పౌరుడు తన ఇష్టం వచ్చిన పనిలో చేరవచ్చునా, లేక ఆతనికి ఇవ్వబడిన పనిలోనే చేరాలని న్యాయ చట్టం నిర్బంధిస్తుందా?

సమాధానం:—(అఖిల దేశ ట్రేడ్ యూనియన్ల కేంద్ర సంఘం న్యాయశాఖ అధిపతి ఐ. ద్వోర్కిన్కోవ్) ప్రజలు నిర్బంధంగా పని చేయాలని ఆదేశించే చట్టాలేవీ సోవియట్ దేశంలో లేవు. పౌరులు వారికి ప్రత్యేకించి నిర్దేశింపబడిన పనులలోనే చేరాలన్న చట్టాలు అంతకంటే లేవు ప్రతివ్యక్తి తన ఇష్టాన్ని, నిపుణతను అనుసరించి తన పనిని ఎన్నుకొనవచ్చును. ఎవరైనా ఒక పౌరుడు తన ఉద్యోగాన్ని వదులుకోవాలన్నా, లేక మరొక కొత్త ఉద్యోగానికిపోవాలన్నా అతనిని ఎవ్వరూ ఆపరు.

# కార్లో డున్నో



యన్. నొసోవ్

( ) ర్లో వెళ్ళడమంటే. డున్నోకు చాలా సరదా.

డ్రైవర్ స్విప్టీ, తరచుగా అతనిని కార్లో తీసుకవెళ్ళేవాడు. కాని డున్నో తానే డ్రైవింగు చేయడం నేర్చుకోవాలని బుద్ధిపుట్టి. ఒకరోజున స్విప్టీని యిలా అడిగాడు :

"నన్ను కారు నడపనియ్యి. కారు నడపడం నాకు కూడా నేర్చుకోవాలనుంది."

"నీకిది తెలీదు. ఇది మోటారుకారు. దీన్ని ఎలా నడపడమో ముందుగుండా నేర్చుకోవాలి" అన్నాడు స్విప్టీ.





"తెలుసుకోడాని కేముంది ? నువ్వు చేస్తో న్నది నేను చూస్తున్నాను గదా—లీవర్లును కాస్త లాగడమూ చక్రం తిప్పడమూ. చాలా సులభం" అన్నాడు డున్నో.

"సులవుగానే కనిపిస్తుంది. కాని అది నిజంగా కష్టం. కారు గుద్దించి, చస్తావు."

ఒకరోజు స్విప్టీ ఎక్కడికో వెళ్ళిపోయాడు; పెరట్లో వున్న కార్లోనికి ఎక్కి డున్నో లివర్ను లాగడమూ, పెడల్సు నొక్కడమూ మొదలు పెట్టాడు. మొదట్లో ఏమీ జరగలేదుగాని, తర వాత హటాత్తుగా కారు కుదుపుతో కదలడం ప్రారంభించింది. కొన్ని తవుటి పురుగు లిది కిటికీలో నుండి చూసి బయటికి పరుగెత్తు కొచ్చారు.

"ఏం చేస్తున్నావు నువ్వు?" అని వాళ్ళరి చారు. "చచ్చిపోతావు!"

"చచ్చిపోను!" అన్నాడు డున్నో, కాని ఆ క్షణాన్నే, పెరడుకు మధ్యగా వున్న కుక్క గూడు మీదికి పెట్టేశాడు. ధన్! ధన్! కుక్క గూడు ముక్క చెక్కలైంది.

డున్నోకు కంపర మెత్తింది. వాడు కారును ఆపుదామనుకున్నాడు, ఒక లివర్ లాగాడు, కాని అది ఆగడానికి మారు యింకా జోరుగా పరు గెత్తింది. త్రోవకు మధ్యగా ఒక వేసవిగృహం వుంది, ధన్! ధన్! వేసవి గృహం కూలి పోయింది, కర్రచెక్కలు డున్నో పైకి ఎగురు తున్నాయి. ఒకటి వాడి వీపుకు కొట్టుకుంది, యింకొకటి తలకు కొట్టుకుంది. వాడు స్టీరింగ్ చక్రాన్ని యిటూ అటూ తిప్పుతూనే వున్నాడు.

కారు పెట్లో తీవ్రంగా పరుగెత్తుతోంది. డున్నో అరుస్తున్నాడు:

"గేట్లు తీసెయ్యండి, లేకపోతే అన్నీ నాశ నము చేస్తాను!"

తవుటి పురుగులు గేట్లు తీసేశారు. డున్నో కారును వీధిలోనికి పట్టించాడు. పెద్ద గందర గోళం అవడంవల్ల తవుటి పురుగులు తమతమ యిళ్ళల్లోంచి పరుగెత్తుక వచ్చారు.

"త్రోవలోలెండి!" అంటూ అరిచాడు డున్నో, కారు దూసుకపోతుంటే.

వాళ్ళు కారును ఆపలేకపోయారు, పట్ట ణంలో డున్నో దూసుకపోతున్నాడు, కారును ఆపలేక. చివరికది నదిదగ్గరకు వచ్చి, ఎత్తుగా వున్న ఒడ్డుమీదనుంచి తల్లక్రిందులుగా పడి పోయింది. డున్నో బయటికి తుళ్ళిపోయి నది ఒడ్డుమీద పడిపోయాడు. కారు నదిలో అడుక్కు మునిగిపోయింది.

తవుటిపురుగులు డున్నోను ఎత్తి యింటికి మోసుకవెళ్ళారు. వాళ్ల వాణ్ని పక్క మీద పడుకోబెట్టారు, తరవాత వాడు కళ్ళు విప్పాడు.

వాడు అటూయిటూ చూసి, బాధతో మూలి గాడు.

"నేనింకా బ్రతికే ఉన్నానా?"



"అవును, కాని దయచేసి కదలకండా మెదలకుండా ఉండు. నేను పరీక్ష చెయ్యాలి" అన్నాడు డాక్టర్ పిల్మన్.

అతను డున్నో బట్టలు విప్పాడు. పరీక్ష చేసి యిలా చెప్పాడు:

"వింత అనిపించవచ్చునేమోగాని ఒక్క ఎముకకూడా విరగలేదు. కాని నీ శరీరంలో కొన్ని కొద్దిగా కొయ్యముక్కలు గుచ్చుకున్నాయి, కొన్ని దెబ్బలు తగిలాయి."

"కొయ్యముక్కల్ని బయటికి తియ్యాలి" అన్నాడు డాక్టర్ పిల్మన్ తలాడిస్తూ.

"నొప్పి పెడుతుందా?" అని అడిగాడు డున్నో కంపరమెత్తి.

"అబ్బే, ఏమీ నొప్పిపెట్టదు. ఇదుగో, అన్నిటికంటె పెద్దదానిని మొదట తీసేస్తాను."

"ఓ, అమ్మో!" అని అరిచాడు డున్నో.

"ఏమిటి, నొప్పి పెట్టిందా?" అని అడిగాడు డాక్టర్ పిల్మన్ ఆశ్చర్యంగా.

"అవును నొప్పి పెట్టింది!"

"సరే, నువ్వు భరించకతప్పదు. ఇంకొక కొయ్య ముక్కమాత్రమే మిగిలి పోయింది."

"వదిలిపెట్టు. వంట్లో ఒక కొయ్యవుండి పోతే ఫరవా ఏమీలేదు."



"అమ్మో! అమ్మో!"

"అయిపోయింది. ఇప్పుడు నీ టెంపరేచర్ చూడాలి."

"ఒద్దు! ఒద్దు!"

డాక్టర్ ఫిల్మన్ ధర్మామీటర్ తీసుక రావడానికి వెళ్ళాడు.

డున్నో పక్కమీంచి దభాలున లేచి, కిటికీలోనుంచి బయటికి గంతేసి పరుగెత్తి పారిపోయాడు. డాక్టర్ పిల్మన్ ధర్మామీటరు తీసుక వచ్చి చూస్తే, డున్నో మాయమైపోయాడు.



---

## లెనిన్ కన్న కల నిజమయింది

(1వ పుట తరువాయి)

లెనిన్‌కు మాస్కోకు పంపించబడింది. కార్మిక కర్షక 'రిపబ్లిక్ ప్రకటించిన స్వయంనిర్ణయాధికారం, పీడిత ప్రజల విముక్తి సూత్రాలు, తమ స్వాతంత్ర్యం కొరకు వీరోచితంగా పోరాడుతున్న వర్గచైతన్యంగల భారతీయుల హర్షాన్ని అంతగా పొందుతున్నట్లు తెలుసుకొని తాను చాలా ఆనందపడ్డానని వి. ఐ. లెనిన్ వారికి వ్రాసిన జవాబులో తెలియజేసారు.

ఆ తర్వాత యెన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. భారత దేశంలో వలసపెత్తందారీ విధానము అంతరించింది. స్వతంత్ర మహా భారత దేశం అవతరించింది. దృఢమైన సోవియట్-భారత మైత్రిని గురించి లెనిన్ కన్న కలలు నేడు నిజమయ్యాయి.



హృదయంపై శస్త్ర చికిత్సను చేస్తున్న డాక్టర్ హెలెన్ దామిర్ ←

# హృదయానికి శస్త్రచికిత్స

**< ఆర్. బొరెత్స్కీ >**

మహానగరం గాఢ నిద్రలో నున్నది. సందడిగా వుంటూవచ్చిన మాస్కో నగర వీధులు నిర్మానుష్యమయ్యాయి. ఇండ్లలోను, దుకాణాలలోను దీపాలు ఆర్పివేయబడ్డాయి. మొదటి నగర హాస్పటల్‌లోని ఆపరేషన్ల శాఖలో అంతా నిశ్శబ్దంగావున్నది. హెలెన్ దామిర్ అను యువతియైన డాక్టర్ డ్యూటీలో వున్నది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో హఠాత్తుగా గంట మ్రోగసాగింది. ప్రమాదమేదో జరిగింది గాబోలు! ఎక్కడో ప్రమాదం జరిగిందంటే, ప్రమాదంలో చిక్కుకొన్న వ్యక్తి అప్పుడే, తక్షణ సహాయంకొరకు, వచ్చెయ్యడం జరుగుతుంది!

ఆపరేషన్ చేసే టేబుల్‌మీద ఒక కుర్రవాడు—15 లేదా 16 సంవత్సరాల వాడు—వున్నాడు. అతని ముఖం స్ఫటికంలాగ పాలిపోయి వున్నది. కనురెప్పలు గట్టిగా మూతబడి వున్నాయి. గుండెకు ఎడమ వైపున, చుట్టూ గడ్డకట్టిన రక్తపు మరకలు గల చిన్నగాయం ఒకటి వున్నది.

నాడి? కొట్టుకోటం లేదు.

ఊపిరి? ఆడడంలేదు.

తెల్ల దుస్తులలో ఉన్న వ్యక్తులు అవసరమని తలిచినప్పుడు మాత్రమే, ముక్తసరిగా మాట్లాడుతున్నారు. మాట్లాడడానికి ఇక్కడ అవకాశం లేదు. చూపులు, సంజ్ఞలతో పనులు జరిగిపోతున్నాయి.

"గుండెలో ప్రాణాంతకమైన గాయం—బృహద్ధమనికి దెబ్బ తగిలింది. కొద్ది క్షణాలు ఆలస్యమయిందంటే ఇక లాభం ఉండదు. బహుశ ఇప్పటికే మించిపోయిందేమో?"—అని లెనా ఆలోచించసాగింది. ఆమె గుండె నిబ్బరం కలదనీ, గట్టిగా పని చేస్తుందనీ చెప్పుకొంటుంటారు. కాని ఇప్పుడామెకు భయంగా వున్నది. గుండెలో గాయానికి వైద్యంచేయడం ఆమెజీవితంలో ఇదే ప్రథమపర్యాయం.

"ఏం చెయ్యడం?"—ఒకే ఒక మార్గం వున్నది. "ఆపరేషన్ చెయ్యడమే ఆ మార్గం."

ఆమెచేతివ్రేళ్లు చురుకుగా, చాతుర్యంతో, ధైర్యంగా పనిచేయసాగాయి. ఆపరేషన్ చేసే నికిల్ లోహపు కత్తి తళతళ లాడింది. చిట్టచివరికి గుండె, మానవునిగుండెకాయ లెనా హస్తాల్లో కనబడింది. అది ఆగిపోతున్న గడియారంవలె, వినీ వినబడకుండా మందంగా కొట్టుకొంటూ మళ్ళీ ఒక్కొక్కసారి వేగంగా కొట్టుకొన సాగింది. ఈ కొన ఊపిరిగూడా ఆగిపోయేటట్లు కనబడుతున్నది. ఆ తర్వాత యేమవుతుంది!....



ప్రపంచంలో, హృదయంపై శస్త్ర చికిత్స చేసిన ప్రప్రథమ నారీమణి డాక్టర్ హెలెన్ దామిర్ ↓

మానవజీవం—అత్యంత విలువైనది—డాక్టర్ చేతిలో వున్నది. అవును, ఇక్కడే వున్నది—జీవం! లెనా తన జీవితంలో ఆ మొట్ట మొదటిసారిగా ఆ జీవంపై తనకుగల సంపూర్ణ బాధ్యతను, శక్తిని గుర్తించింది. మానవుని జీవం అంతకంటే విలువైనది, ముఖ్యమైనది ఇంకేమున్నది?

ఆ ఆపరేషన్‌ను యెలా జరిపిందో లెనా ఇప్పుడు గుర్తుకు తెచ్చుకొనలేకుండా వున్నదంటే ఆశ్చర్య పడవలసిన విషయమేమీలేదు. ఆమె ఆలోచనలు, శ్రద్ధ—ఒక్కటేమిటి, అన్నీ—ఆ కుర్రవాని గుండెలోని గాయంమీద కేంద్రీకృతమయ్యాయి.

ఆఖరి కుట్టుపడి, గుండె తిరిగి బాగా కొట్టుకొంటున్నట్టు యంత్రం చూపాక, రోగి ప్రాణానికి ప్రమాదం తప్పిందని తేలిన తర్వాతనే లెనా ఆపరేషన్ టేబులు దగ్గర్నుంచి వెళ్ళింది. కఠినమైన ఆ గంటన్నర కాలం తర్వాత మొట్టమొదటిసారిగా అప్పుడు మాత్రమే ఆమె తన చుట్టు యేమి జరుగుతున్నదో గ్రహించింది. ఒక నిముషం క్రితంవరకు ఒక వస్తువుమీద కేంద్రీకృతమై, అరమోడ్పుగా ఉండిన కళ్లు, వాటి గంభీరత తగ్గి, ఇతర విషయాల వైపు మళ్ళాయి.

హఠాత్తుగా ఒక అద్భుతమైన సంఘటన జరిగింది. ఆమెకు అర్హమైన ఆనందం లభించింది. సర్వసాధారణంగా గంభీరంగా వుంటూ, అవసరమైనప్పుడు మాత్రమే మాట్లాడుతూ వుండే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సర్జన్ ప్రొఫెసర్ బకులేవ్, లెనాను హృదయపూర్వకంగా అభినందించారు. ఆయనే ఆమె గురువు. ప్రపంచంలో గుండె ఆపరేషన్ చేసిన మొట్టమొదటి స్త్రీ గాబట్టి ఆమె ఆ అభినందనలకు అర్హురాలే. ఒక్క గుండె ఆపరేషనే కాదు, బృహద్ధమని ఆపరేషన్ కూడా. 1913 లో జనిలిడ్జే అనే ఒక ప్రఖ్యాత సోవియట్ సర్జన్ బృహద్ధమని ఆపరేషన్ చేశారు. అప్పటినుండి ఈ మధ్య గడిచిన 43 సంవత్సరాలకాలంలో బృహద్ధమని ఆపరేషన్ కేసులు అయిదు మాత్రమే విజయవంత మయ్యాయి. హెలెన్ దామిర్ చేసిన ఆపరేషన్, యావత్తువైద్యచరిత్రలో జరిగిన అలాంటిఆపరేషన్లలోఆరవది.

"నిన్ను చూచి నేను చాలా గర్వపడుతున్నాను. కాని నేను కూడా సర్జన్‌నే గాబట్టి కొంత ఈర్ష్యకూడా పడుతున్నాను," అన్నారు ప్రొఫెసర్ బకులేవ్.

ఇది దాదాపు ఒక అర్ధ సంవత్సరం క్రితం జరిగింది. తాతార్ జాతీయురాలైన హెలెన్ దామిర్ సోవియట్ వ్యవస్థ స్థాపితమవడం మూలంగానే విద్యాభ్యాసాన్ని పొంద గలిగింది. ఈ మధ్యనే ఆమె ఎమ్. ఎస్. డిగ్రీని పొందింది.

గుండె ఆపరేషన్లు చేయడం ఆమెకు మామూలు పనై పోయింది. పది సంవత్సరాలపాటు — మొదట వైద్య విద్యాసంస్థలోను, తర్వాత పట్టభద్రానంతరపుకోర్సులోను-జరిపిన దైనందిన కృషిమూలంగా ఆమె సర్జన్‌కు వుండవలసిన ప్రావీణ్యతను, వైద్యవిద్యలో పరిపూర్ణ విజ్ఞానాన్ని సంపాదించ గలిగింది. ఆమె తాను పొందిన అనుభవాన్ని ఇతరులకు తెలియజేయడానికి కుతూహల పడుతుంది. విదేశాల నుండి కూడా సర్జన్‌లు వచ్చి ఆమెదగ్గర ఆపరేషన్లు చేయడం నేర్చుకొంటుంటారు. పట్టభద్రానంతరపు కోర్సును మాస్కోలో చదివిన బల్గేరియన్ డాక్టర్ చ్వాదర్ ద్రగోచెవ్ నుంచి ఆమెకు లేఖలు వస్తూవుంటాయి. ఒవిది మరీనా అనే ఒక రుమేనియన్ డాక్టర్ ఆమెయొక్క కృషిని శ్రద్ధగా అధ్యయనం చేస్తున్నది.

హెలెన్ దామిర్‌కూడా అధ్యయనం చేస్తున్నది. డాక్టర్ ఆఫ్ సైన్స్ కావాలని ఆమె అభిలాష. ఆమెను గురించి తెలిసిన వారెవ్వరే గాని ఆమె విజయం పొందగలదన్న విషయాన్ని శంకించరు. 27 సంవత్సరాల ఆ యువతియొక్క మనో నిశ్చయం అంత గట్టిది

# కిరోసిన్‌తో మంట లార్పడం

ఎఫ్. పొతియెవ్స్కి

అగ్నిమాపక దళం కార్లు రోడ్డుమీద శరవేగంతో పోతున్నాయి. ఒక అసాధారణమైన మంటలను ఆర్పడాని కవి వెళ్ళుతున్నాయి: బ్రహ్మాండమయిన్న కిర్సనాయిలు టాంకు ఒకటి తగులబడి పోతున్నది. దానిని ఆర్పివేయడానికి అవి రప్పింపబడ్డాయి. ఇలాంటి మంటలను ఆర్పడానికి ఇదివరకు చాలా ఖరీదైన ఒక రసాయనిక నురుగు ఉపయోగింపబడుతూ ఉండేది. కాని ఇప్పుడు దానికొరకు కేంద్ర అగ్నిమాపక పరిశోధనాలయం వారు, ఒక సరికొత్త పద్ధతిని కనిపెట్టారు. ఆ పరిశోధనాలయం వారు నాకు యీ విధంగా దానిని గురించి తెలియజేసారు.

జ్వలించే ద్రవం యేదైనాసరే ఒకానొక శీతోష్ణస్థితిలో తగులబడుతుంది. అంతకంటే తక్కువ శీతోష్ణస్థితిలో ఉన్నప్పుడది తగులబడజాలదు. ఉదాహరణకు కిర్సనాయిలు 18 డిగ్రీలు సెంటిగ్రేడ్‌లో ఉన్నప్పుడు తగులబడదు. కాని దాని ఉపరితలం 30 డిగ్రీలకు వేడెక్కగానే నిప్పంటుకొని తీవ్రంగా తగులబడుతుంది. అయినప్పటికి, జ్వలించే ప్రక్రియలోగూడా కిర్సనాయిలు ఉపరితలంలోని ఒక సన్నని పొరవరకు మాత్రమే వేడెక్కుతుంది. తక్కిన భాగమంతా మొట్టమొదటి శీతోష్ణస్థితిలోనే ఉంటుంది.

తగులబడుతున్న పొరయొక్క శీతోష్ణస్థితిని తగ్గించాలంటే, అనగా దానిని జ్వలించకుండా చేయాలంటే, దానిపైపొర, క్రిందిపొర కలిసిపోయేటట్లుగా కలిపివేస్తే సరిపోతుంది. ఒక ప్రత్యేకమయిన కంటెయినర్ ద్వారా కంప్రెస్డ్ గాలిని మండుతున్న కిర్సనాయిలులోకి వదులుటద్వారా దానిని క్రిందుమీదుగా కలుపుతుంది. వేడెక్కిన కిర్సనాయిలు భాగమూ, చల్లని కిర్సనాయిలు భాగమూ యీ విధంగా కలిసిపోవడంద్వారా కిర్సనాయిలు శీతోష్ణస్థితి ముప్పై డిగ్రీలకు కంటే తక్కువై పోతుంది. ఇట్టి శీతోష్ణస్థితిలో కిర్సనాయిలు జ్వలించదు. ఈ విధమైన తెలివైన పద్ధతితో, తగులబడుతున్న కిర్సనాయిలు కిర్సనాయిలుతోనే ఆర్పబడుతుంది........వజ్రం వజ్రంతోనే ఛేదించబడుతుంది!

ఇప్పుడు మనం, కిర్సనాయిలు టాంకును బ్రహ్మాండంగా అలముకొంటున్న మంటలవైపు చూచినట్లయితే, అగ్నిమాపకదళం వారు యేమి చేయబోతున్నారో గ్రహించగలం. ఏ మాత్రము కాలయాపన చెయ్యకుండా, వెంటనే, ఒక హోస్‌పైపును తీసి కంప్రెస్డ్ గాలి వున్న పరికరానికి ఒక కొనను తగిలించి, రెండవకొనను తగులబడుతున్న కిర్సనాయిలు టాంకులోకి వదులుతారు. కంప్రెస్డ్‌గాలి చల్లని కిర్సనాయిలును పైకి తెస్తుంది. ఈ విధంగా క్రమంగా కిర్సనాయిలు శీతోష్ణస్థితి తగ్గిపోవడంతో మంటలు నింపాదిగా ఆరిపోతాయి. ఎంత పెద్ద మంటలైనా సరే నేడు 5-10 నిముషాల లోపల ఆర్పివేయ బడగలవు.

ఈ విధంగా సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు అతిప్రమాదకరమైన మంటలను—పెట్రోలు తగులబడుటవల్ల కలిగే మంటలను—ఆర్పుటకు సులభము, చవుక, విశ్వసనీయము అయిన పద్ధతిని కని పెట్టారు.

## స్వగృహంలో లెనిన్

[8వ పుట తరువాయి]

మేము మేడమీదనుండి క్రిందికి వెళ్ళాం. ఆ యింట్లో వున్న చిన్న పెరడులోకి. రెండు అద్భుతమైన కొత్త బైసికిళ్లు అక్కడ వున్నాయి (ఒకటి పురుషునిదీ, ఒకటి స్త్రీదీ). అప్పుడే వాటికి కట్లు విప్పినట్టుగా వుంది.

"ఈ వైభవం చూడండి! ఇదంతా నాద్యా పనే. నాకు సైకిలు మీద వెళ్ళడమంటే యిష్టమనీ, కాని అందుకు మా దగ్గర డబ్బులేదనీ ఆమె ఒకసారి అమ్మకు వ్రాసింది. అమ్మ చాలా విచారించి, మా వాళ్ళతో కలసి చాలా సొమ్ము సేకరించింది. మార్క్ తిమొఫెయెవిచ్ (అన్నా ఇల్యినిచ్నా భర్త ఎలిజరోవ్) తాను పనిచేస్తోన్న నదెజ్దా కంపెనీద్వారా బెర్లిన్ నుండి మాకోసం రెండు బైసికిళ్ళు పంపమని వ్రాసేరు. హటాత్తుగా రవాణా కంపెనీనుండి ఒక నోటీసు వచ్చింది—సామాను ఎక్కడికి పంపాలని. ఇది బహుశ రహస్య సారస్వతమో లేకపోతే ఎవరైనా మాకు పుస్తకాలు పంపారేమోనని అనుకున్నాను. వాళ్ళు దానిని తీసుకవచ్చారు—ఆ 'రహస్య' వస్తువులివిగో! చూడండి, కాస్త చూడండి యివి ఎంత అద్భుతమైన సైకిళ్ళో!" అని లెనిన్ పలుసార్లన్నారు, వాటిని పరీక్షచేస్తూ, టైర్లకు గాలి నింపుతూ, స్ప్రూలు బిగిస్తూ. "అమ్మ వుంది! ఆమె మాకు చాలా ఉపకారం చేసింది! ఇప్పుడు నాద్యా, నేనూ ఒకరిమీద ఆధారపడనక్కరలేదు. మేమిక రైలు ఎక్కం, మాస్వంత సైకిళ్ళు ఉపయోగించుకుంటాం!"

అమ్మ దగ్గరనుండి అనుకోకుండా వచ్చిన యీ బహుమానాన్ని చూసుకుని లెనిన్ పడ్డ ఆనందం నిజంగా చూడదగినది. లెనిన్‌ను సంతోషపెట్టినది, అన్నిటికంటె ప్రధానంగా తనతల్లి, బంధువులూ తన పట్ల, నదెజ్దా కృప్స్కయా పట్ల చూపిన శ్రద్ధేనని మా అందరికీ పూర్తిగా తెలుసును. ఇది ముఖ్యంగా ఆయనకు ఎంతో మోదకారణమైంది.

నదెజ్దా కృప్స్కయా సంతోషంతో చిరునవ్వులు కురిపిస్తూ, లెనిన్ ఆనందానికి సంతోషించింది.

"నేను వెళ్ళి అమ్మకు ఉత్తరం వ్రాస్తాను, దానిని దయచేసి రిజిస్టర్డ్ పోస్ట్‌లో పంపించు" అన్నారాయన, వారుంటూన్న బోర్డింగ్ హౌస్ రెండవ అంతస్తుకు మెట్లెక్కుతూ.

"ఆయన పసిపిల్లవానిలాగా సంబరపడుతున్నారు" అని మెల్లగా నాతో అంది నదెజ్దాకృప్స్కయా, "ఆయన తల్లిని చాలా ప్రేమిస్తారు; కాని మా వాళ్ళ అంత శ్రద్ధ తీసుకుంటారని ఆయన అనుకోలేదు. ఇప్పుడాయన ఎంతో సంతోషిస్తున్నారు."

మేము మేడమీదికి వెళ్ళాము, అక్కడ నదెజ్దా కృప్స్కయా ఆవసరమైన వస్తువుల నన్నిటినీ మూటలు కడుతోంది.

"దీని నంతట్నీ నా సైకిలు వెనుక కారియర్‌మీద పెడదాము. ఇప్పుడు వాటిని భుజాలమీద మోసుక వెళ్ళవలసిన అగత్యం లేదు. ఇదుగో ఉత్తరం. దీనిని వెంటనే పంపివెయ్యి, మర్చిపోవద్దు!" అన్నారు లెనిన్.

అన్ని విషయాలూ చర్చించి, టెలిగ్రాములకు, ఉత్తరాలకూ యివ్వవలసిన అడ్రెసుగురించి అంగీకరించిన తరవాత పెద్ద మెట్లమీద నుండి మేము క్రిందికి దిగాము.

"కామ్రేడ్స్ సెలవు! నాద్యా, సైకిలెక్కు!" అని కేకవేసి లెనిన్ తొందరగా సైకిలెక్కారు.

మాకు నమస్కరించాక నదెజ్దా కృప్స్కయా ధైర్యంగా ఆయనను అనుసరించింది. ఏపుగా పెరిగిన పచ్చికకు మధ్యగావున్న రోడ్డు మలుపు వెనుక వారు క్షణంలో అదృశ్యులయ్యారు.

---

## చినిగిన సైనికకోటు వేసుకొన్న వృద్ధుడు

(34వపుట తరువాయి)

మేలుకు, ఆయనకు కృతజ్ఞత చెప్పుకోలేక పొయ్యానని ఎంతో విచారిస్తున్నాను, ఇప్పుడు ఏం చెయ్యాలన్నా శక్తిలేదు, ఆరోగ్యంలేదు. సదుపాయంకూడా లేదు.

ఇంటికి విసురుగా వచ్చిరావడంతోటే ఇంటి యజమానురాలి కూతుర్ని పిలిచి, 'లెనిన్ ఛాయాచిత్రం తీసుక రమ్మన్నాను, నేను తొందరగా దాన్ని పోల్చుకోవాలని చెప్పాను!' ఆవిడ, తన చిన్న గదిలోకి వెళ్ళి, ఒక వార్తాపత్రిక తీసుకవచ్చింది. దానిపేరు 'బెద్నోతా' (పేదరైతు). ఆ పత్రికలో ఆయన బొమ్మ వుంది, ఇక్కడుంది దాన్ని మీకు చూపెడ్తాను."

ఆ వృద్ధుడు తన కోటు గుండీలు తీసి, జేబులోనుంచి ఒక పాత పెట్టె తీశాడు. దానికి చుట్టివున్న దారం విప్పి, అందుట్లో నుంచి ఒక పాత పత్రికలోంచి కత్తిరించిన లెనిన్ చిత్రాన్ని తీశాడు. అది బాగా నలిగి అంత స్పష్టంగా కనిపించడం లేదు.

"అప్పటినుంచీ దీన్ని నా హృదయంమీద హత్తుకుంటున్నాను. ఇదెప్పుడూ ఇక్కడే వుంటుంది" అన్నాడు, గౌరవ పురస్సరమైన గద్గద కంఠంతో. "మనిషంటే ఆయనే, నేను చెబుతున్నాను మహానుభావుడు."

ఆ మాటలు చెబుతూ ఆ వృద్ధుడు కంపించి పోతున్నాడు, పాలిపోయిన ఆయన చెక్కిళ్ళమీద కన్నీరు ధారకట్టింది.

ఏం చెప్పను ఆయనకు? నాకు పెదిమ విప్పడానికే భయమేసింది, కాగా నేను ఎంత కదలి పోతున్నానో ఆయనకు తెలియక పోవడమే మంచిదనిపించింది.

మేము, ఎంతోసేపు నిశ్శబ్దంగా కూర్చున్నాము.

పండిపోతున్న చెట్లకొమ్మలమీద మంచుపొర దట్టంగా క్రమ్ముకొంటున్నది. దూరంలో కోడి కూతేసింది. రైలుపోతున్న చప్పుడు వినిపించింది. బొగొవో గ్రామంలోంచి గప్పున పొగ కనిపించింది. రొట్టె కాలుస్తున్న వాసన గుప్పున కొట్టింది. క్రసవియా మెచా మీదుగా పోయే రోడ్డున నడుస్తున్న బండి చక్రాల గరగర, బాటన పాట పాడుకొంటున్న ఒక పిల్లగొంతు వినిపించాయి:

"ఉవ్వెత్తున పండి వొరిగిన
    చేల మాటున
దాగివున్నది నమ్రముగ
    రమ్యమవు మా పల్లెటూరు"

"చూడండి, మన రష్యా ఎలాగుందో!" అన్నాడు ఆ వృద్ధుడు, కొంచెం సేపు మౌనం వహించి. "బాగా అలసటగావుంది. చూడండి వయస్సు మళ్ళుతున్నదాయె. ఇంక లేద్దామా?"

# వినోద చిత్రాలు

దుష్ట ప్రశ్న



"ఓహో! ఓహో!....నా పాలన్నీ వొరికిపోయ్యాయి!"
"వద్దు, వద్దు, ఏడవొద్దు, ఎంత పెట్టి కొన్నావు, బిడ్డా ?"



"దయచేసి ముఖంమీది అకృత్రిమ ముఖాన్ని తీసేద్దురూ"
"సంతోషంగా".



"అమ్మా, అమ్మా, నా పెళ్లయిందే"
"ఎవరితో తల్లీ ?"
"ఎవరితోటా....ఓ నల్లని దాన్తోటి!"

ఉన్నత శిక్షణ పొందిన ప్రవీణుడు!



"నా వొంటెకు లోపం ఏమిటో చెప్పండి, డాక్టర్."

"ఏముంది, కనపడదం లేదూ, గూనుంది!"



గురుపును మించిన శునకం

